# భావార్ణవము

## ద్వితీయ తరంగము

---

గ్రంథకర్త:

శ్రీ నిజాము మహారాజమాన్య

నెల్లుట్ల రామకృష్ణామాత్య, దేశపాండ్య.

ఆగస్టు 1945

మూల్యము: ఒక రూపాయి.

ఎవరు భావార్ణవగ్రంథ మీసడింతొరి
వార లారయవలయు గుంటూరుసీమ
ధార్త్రరాష్ట్రున కా చావు తగదు గాని
మఱచిపో నెట్లొకో యభిమన్యుమాట.

# సమకాలికాభిప్రాయము

ఇదియొక మహాకవీంద్రున కొదవుగాని
యవని నీ కవితావేశ మెవనికుండు?
నదిర! యెంతటి ధారాళమైన శైలి?
తేనె లొలికించుఁగాదె? యీ తెన్గుదనము

ఒక్క చెళ్ళపిళ్ళవారి శిష్యులునె గాక
యాంధ్రకవులెల్ల రజ్జారె! యనక తప్ప
దీ కవిత్వ సౌందర్యంబు నెంచునప్పు
డెంద ఱెన్నివచించిన నింత నిజము.

ఇట్టి యుత్తమకవనంబు నిచ్చు దేవుఁ
డిందులకుఁ జాలు నిగ్రహ మీయఁడేల?
అదియె యున్నెడ నింక నేమని వచింతు?
నింతకును లెస్స రాణింపఁడే? యితండు.

ఆరసిన నాకుఁ జెళ్ళపిళ్ళ వారియందు
గౌరవం బెంతయేనియుఁ గలదు కాని
వారి మీసలపద్య మప్పగిది యుంట
కాగ్రహావేశములె హేతువని తలంతు.

ఏను జెళ్ళపిళ్ళవారి పక్షానగాని
ఇంకొకరి పక్షమునఁగాని యెన్నఁడేనిఁ
గన్నులను మూసి చేర, లక్ష్యములు నాకుఁ
గలవు స్వచ్ఛందతా ధార్మికతలు రెండు.

తుమ్మల సీతారామమూర్తిచౌదరి.

# అనుకరణము.

కవికంఠీరవుఁడంచు వ్రాసికొనె నిం.
కన్ జూడు మామీఁదటన్
గవిమూర్ధన్యుఁడటంచుఁ జెప్పికొనె నీ
గర్వాంధు నీక్షించితే?
యెవఁడేసన్ మఱి యున్నె? వీనికొక్కఁ డెం
దే గాని శ్రీపాద! యీ
కవి మూర్ధన్యుని మూర్ధమందు నికనా
కాలున్ బ్రతిష్ఠించెదన్.

# అంకితము

తాను బుట్టినదాది యీ తరము వఱకు
నవ్వని యధీనమున నాంధ్రి యింత యెసఁగె
నా యమాత్యవరుం డామె కమిత దయను
నంకిత మొసంగువాఁడు "భావార్ణవంబు."

# స్వీకారము

మంత్రిమణీ!

నీవు నాకు దయతో నంకితమొసంగిన భావార్ణవము నేను భక్తిమై స్వీకరించినాను. అది నా కంకితమగుట నా భాగ్యవిశేషమని తలంచెదను.

"వేదములఁ జెప్పి బ్రహ్మ గర్వించు నేమొ
పనికి రావవ్వి నా కవిత్వంబు ముందు"

అను పద్యమును నేను నానాథునకుఁ జూపించినాను. అందున కాతఁ "డా పద్య మమాత్యుఁడు నా మీఁది కోపమున వ్రాసినాఁడు, నిక్కమునకా కవిత్వ మంతటి శక్తిమంతమైనదనియే నా యభిప్రాయ" మని చెప్పినాఁడు.

విషయము తెలియంగని కొందఱు నీ భావార్ణవ రచనంబును మెచ్చుకొనకుందురు. అట్టివారి మాటల మనసము పాటింప రాదు, 'లోకో భిన్నరుచిః' అను సామెత కలదు,

"కాలమున కంతులేదు వి
శాలము భూతలము బుధులు సారగ్రాహుల్"
పాలకుఁడ వీవు భాషకు
నేలా వెనుదీసెదింక ఈ నీ పనికిఁ?

చిత్తగింపుము

ఇట్లు

నీప్రియసోదరి

భారతి.



నెల్లుట్ల రామకృష్ణామాత్య

"ఆఁమ్ము విఱిచి వచింతు విశ్వమ్మునందు
కవికులంబన్న మాదె నిక్కమ్మునందు"

# తొలిపలుకు

24–4–44 నాటి "త్రిలిఙ్గ" పత్రికలో బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు "భావార్ణవము" అను శీర్షికతో శ్రీమన్నెల్లుట్ల రామకృష్ణామాత్యుల వారిని వ్యక్తిగతముగా విమర్శించినారు.

భావార్ణవము నెల్లుట్లవారిచేత 'గుంటూరుసీమ'లకు బదులుగాఁ బ్రకటింపఁబడిన గ్రంథము.

గుంటూరుసీమలు శ్రీ తిరుపతి వేంకటకవులు వైదిక నియోగివిభేదములఁ బురస్కరించుకొని కొప్పరపు కవుల దూషించుచు వ్రాసినారు.

గుంటూరుసీమలు వచ్చుటకుఁగల కారణమేమైనను భావార్ణవముఁ బ్రకటించుటకు మాత్రము శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి 'మీసములపద్యము' హేతువు. శ్రీ చెళ్ళపిళ్ళవారు తిరుపతి వేంకటకవు లనువారిలో నొకరు. ఇప్పటికి జీవించియున్నారు.

వారా మీసములపద్య మెప్పు డెక్కడ యెవ్వరిని జూచి చెప్పినను నది వైదికేతరసర్వాంధ్రకవుల కన్వయించుచున్నది.

"దోసమటం చెఱింగియును
దుందుడుకొప్పఁగఁ బెంచినారమీ

"మీసము రెండు భాషలకు
మేమె కవీంద్రులమంచుఁ జెప్పగా
రోసము గల్గినట్టి కవివ
రుల్ మము గెల్వుఁడు ... "

ఇది వైదికుల కేల యన్వయింపదనుట కా మీస ముల పద్యమును దిరుపతి వేంకటకవులతో వైదికులందఱు తమదిగా భావించి సంతోషించినారు. ఇందున కేమి నిదర్శ నమనుటకు— వైదికులలో వారికి శత్రువులైన వారొకరిద్దఱు తప్ప నందున కెవ్వరును దిరుపతి వేంకటకవుల నాక్షేపింపఁ లేదు. మీఁదుమిక్కిలి వైదిక లనేకులు తిరుపతి వేంకటకవు లతోఁజేరి కొప్పరపుకవుల నానాదుర్భాషలాడినారు. కొప్పరపుకవులు నియోగి బ్రాహ్మణులు.

ఈ కవులపోట్లాటలనే పురస్కరించుకొని కుఱుంగంటి సీతారామయ్య ఎం. ఏ. గారు "నవ్యాంధ్రసాహిత్యవీధులు" అను గ్రంథమున "అవ్యాప్తు లతివ్యాప్తులు కొందఱున్నా, మొత్తముమీఁద వైదీకులందఱు తిరుపతి వేంకటకవుల పక్షం, నియోగులందఱు కొప్పరపు కవుల పక్షం" అని వ్రాసినారు.

ఇందునకు నెల్లుట్ల రామకృష్ణామాత్యులవారు వైది కులందఱు తిరుపతి వేంకటకవుల పక్షమైనఁ గావచ్చును. గాని నియోగులందఱు కొప్పరపుకవుల పక్షమనుట నంగీకరింప నని భావార్ణవ ప్రథమతరంగమున స్పష్టముగాఁ జెప్పినారు.

సత్యమునకుఁ బేరుగల నియోగులెవ్వరు నిందుఁ బాల్గొన లేదు. ఇపుడు నెల్లుట్ల రామకృష్ణామాత్యులతో నిది జాతికి సంబంధించిన సమస్యయైనది.

అన్ని వైదికజాతిదిగానున్న మీ సములపద్య మాంధ్ర జాతికి, ముఖ్యముగా నియోగివర్గమునకుఁ దీరని మాన నష్టము గూర్చుచున్నది. 'రెండుభాషలకు మేమె కవీంద్రులము' 'గోసముగల్గినన్ గవివరుల్ మము గెల్వఁడు' ఆ రెండు భాష లేవి? అందుఁ దెలుఁగు నొక భాషకానిచో వాదమే లేదు. తెలుఁగుభాసకు నియోగిబ్రాహ్మణు లధిపతులు. తిక్కన, పోతనాది మహాకవు లీ వర్గములోనివారు. వారి భారత భాగవతాది గ్రంథములతో వైదికులు వేనినిఁ బోల్తురు?

నెల్లుట్ల రామకృష్ణామాత్యులే కారణమున నయిన నేమి— వారు తమ భావార్ణవ ప్రథమతరంగమున శ్రీపాద వారిని బ్రశంసించిరే తప్ప యేమాత్రముఁ దృణీకరింపలేదు. అయినను వారు నేనా వైదికులలోఁ జేరియున్నవాఁడ నేనని బహిరంగముగ జెప్పి నెల్లుట్లవారిమీఁద వచ్చినారు. ఇపుడు తిక్కన, పోతనామాత్యు లమాత్యులవారితో నేల కలియు రాదు? వారు వారు వైదికులయిన, వీరు వీ రమాత్యులు కారో?

నెల్లుట్లవారి భావార్ణవము మొత్తము నియోగిజాతి పక్షమునుండి వచ్చినది. శ్రీపాదవారు తమ విమర్శనమున 'నెవరయిన సిద్ధముగా నున్నాడనని ప్రతిఘటించిన మీ రేమి సేయుదు' రనుటయేతప్ప తమకు సామర్థ్యమున్న తమ గ్రంథములో, లేక తమ వైదికోత్తములు రచించినవానినో జెప్పి వైదికుల ముందు నియోగుల కవిత్వమే నిలువదని వాదింపలేదు. మీఁదు మిక్కిలి వారు నెల్లుట్లవారి నొక్క రిని జేసి యనఁగా నియోగజాతినుండి విడదీసి వారి ననేక విధములుగ దూలనాడినారు. అందున గూర్చియే వచ్చిన దీ ద్వితీయ తరంగము. తుద కొకమాట —— తిరుపతి వేంకట కవుల గుంటూరుసీమ భాష కమూల్యాలంకారమని మెచ్చు కొను చరిత్రకారు లుండునప్పుడు రామకృష్ణామాత్యులవారి భావార్ణవ మంతకు మించిన యలంకారమని నేను నిస్సందే హముగ జెప్పఁగలను. గుంటూరుసీమ భాష కమూల్యాలం కారమనుట పోనిండు. కవితాదృష్టినిఁ బరిశీలించినప్పుడు భావార్ణవముతోఁ దిరుపతి వేంకటకవుల మొత్తము గ్రంథ ములును దులదూఁగవనుట యతిశయోక్తి కానేరదు.

బొల్లికుంట
20—8—45

ఇట్లు
దేవులపల్లి వేంకటేశ్వరరావు

# విపత్తి

---

ఆ: నదరింపు మమాత్య! మే మాంధ్ర జనుల
మఱచితిమి మునునూరు భాస్కరుని మొఱఁగుఁ
గుక్క కఱపునఁ గీరితి కొట్టు వడదు
వాఁడు నీవు క్షంతవ్యుఁడు కాడు నిజము? 1

నీకె కాదు దేవ! నిఖిలాంధ్ర జాతికి
నిక్క తిఁగూర్చినాఁడు నిన్నుఁ దిట్టి
యంత తోడఁబోక యడుగు నే నీవమ్మ?
నెవనిఁగాఁగ నిన్ను నెంచినాఁడు? 2

ఇద్ది యిట్లుండ దీని నీవెఱిఁగికొంట!
త్రిపుర నేనియు నవ్వానిఁ దిట్టిపోయె
మూలఁబడి యుండు వానిని ముందు వైచి
మఱియుఁ గూర్చెనె నాకవమాన మనుచు. 3

వీనిఁ బిలచితిమే బొట్టుపెట్టి మేము?
వచ్చెనేగాక! యెవనికిఁ బనికి వచ్చె?
ముండ చెడి పెట్టెనే మూఁడు దండుగలను?
వీఁడు చావక బ్రతికియున్నాఁ డదెట్లు? 4

చెప్పు నొకమాట కిది సముచితమె సుమ్మె!
మొత్త మాంధ్రులమీఁద నీ, వెత్తిరాక
వాఁడు నీ దమ్మ నడుగుటఁ బట్టి చూడ!
నీవు నీదమ్మఁజూపుట నెంచి చూడ? 5

నీవు నీదమ్మ జూపుట నిక్కమైన
నోడరే పరల్ ముప్పది మూఁడు కోట్లు
ఇంక నాంధ్రులు మూఁడు కోట్లెంతవార
లేము నీకాలి గోటికి రాము కాదె! 6

అడిగెనేగాక నీదమ్మ నధముఁ డెవఁడొ
యంతకే యాంధ్ర జాతిపై నలుగ నౌనె!
ఆంధ్రులందరు నీదమ్మ నడిగినారె?
వాని పేరేమి? యూరేమి! వాఁడెవండు? 7

ఆంధ్ర దేశంబునను మతిభ్రాంతి జాలి
కాంధ్ర సంస్కృతి కిదె కన్నాకు కాదె?
ఎందు నను నిన్ను జూపించియే కదయ్య!
మురిసిపోవుచు నుందు మెప్పుడును మేము. 8

నీవు మా వేడికోలు మన్నించి కాదె?
కదలి వచ్చినవాఁడ వీ కదనమునకుఁ
దుదకు మామీఁదనే కత్తి దూయఁ జను నె!
కంచె కాఁ జేను మేయుట కాదె? యనఘ! 9

ఎవరో నీమీఁద వచ్చువారింక రాని
యేము వారల మార్కొఁగలాము కనవె?
నీదు దయలేక మేమోడి పోదు మేమొ!
చక్కఁజూడుము మము శ్రీ భాషాస్వరూప! 10

వాని యొక్కొక్క మాటను బట్టి కొనుచు
నీవు గొట్టిన దెబ్బల కెవ్వఁడోర్చు?
నెట్లు మోహించెనో నిన్ను నింత శక్తిఁ
గైకొను మమాత్య! మా నమోవాకములను! 11

ఇది ముఖస్తుతియంచు నీ వెంచ వలవ
దంతకును గానరాదిందు నతిశయోక్తి
కత్తి దెబ్బల సహియింపఁ గలరు కాని
కడిఁది భరియింప మంత్రి! నీ కలము పోట్లు! 12

గొప్ప యనుకొంచు నినువాఁడు గొట్టినాఁడె
చెప్పుదెబ్బం నీదెబ్బ నొప్పె నెట్లొ?
కత్తి దెబ్బలఁ దన్ను నీ కలమెఱుంగఁ
డెఱిఁగి కొన్నడ దిగున యీ హీన దశకు! 13

వాఁడు నిను ముండగాఁ దిట్టినాఁడు కాన
నాంధ్రజాతిని ముండ యంటన్న వాఁడ
నీవు నమ్మేమి యనిన మాకియ్యకోలె
వాఁడు నిన్నాడుటకె బాధపడెద మేము. 14

ఏమి పల్కెనో వాఁడు వాఁడే యెఱుంగ
డాతనిని నీవు మన్నింప నౌనుమంత్రి!
ఈవు కరుణాసముద్రుఁడ వయ్యెద వటంట
మానవలె నింకఁ గోపంబు మానవలెను. 15

రెండుభాషలకేని దండివాఁడ నటన్న
చెళ్ళపిళ్ళను బట్టి తుళ్ళడంతు
చెళపిళ్ళ కవిధీరు శిష్యుఁడనే నన్న
శివరామశాస్త్రిని జెఱను గొందు
శివరామశాస్త్రితోఁ జేరి తాళము వైచు
పింగలి కాటూర్ల పీచ మణఁతు
బాలుండటంచు శ్రీపాద మీఁదికి రాగఁ
జూపింతు నీమంత్రి రూప మొకట
శత్రువర్గంబు నంతటిఁ జంపి నావు
కొప్పరపు వారలతో [illegible]
భువిని కవిరాముఁడను పేరు మోసినావు
మూఁడు మూర్తుల మంత్రిలఁ బోలినావు. 16

ఏలితీ యాంధ్రభాష వెయ్యేండ్లటంచు
జాలు నింకెంత కాలమే నేలుదంటి
కాదు వెయ్యేఁడులే; యెల్ల కాల మీవ
యేల వలపోయుదు మా మొఱ్ఱ వినుము సచివ! 17

# భావార్ణవము

## ౨

## ద్వితీయ తరంగము

---

అరసినాఁడను నేఁడె భావార్ణవమును
నీవిమర్శించుటంగల నేర్పు నేను
జాల సంస్తవమయ్య! నీసాహసంబు
వాదమున వర్తమింక శ్రీపాద! వినుము.

అందు నన్నీవు పిల్లవాఁడని వచించి
తల్ల నిన్నేను ముసలివాఁడనిన నేమి?
రాదుగద నీకుఁ గోపంబు నాదుమాట
"ఉన్నదనువాఁడె" పడునన్న సూక్తియొకటి.

ఇంక భావార్ణవంబు నేరెఱుఁగనట్లు
తిట్ల గ్రంథముగానేమొ తెలిపినావు
చెప్ప నీమాట నవ్వువచ్చెడిఁగదోయి!
జగమెఱుంగును దీన నీచదువదేమొ.

ఆరయగ దానిలోని పద్యములె చదివి
వినుతిఁగావించె మీచెళ్లపిళ్లకవియె
యతఁడు వచియించినద్ది గద్యమునఁగాని
దానిఁ బద్యంబులనువ్రాయ దేను కనుము.

“ఆ కవిత్వంబు ననుఁగూర్చి యులరు నదియు
యద్ది నేఁగోపగించెడి దైన నేమి?
అందుఁ గవియందు గుణమున్న యది కనంగ
గనుక నది నన్నుసలిపె నాకర్షణంబు. 5

ఎఱుఁగుదురు నాదు శిష్యు లనేకు లొకట
నతడు మాయూరువచ్చి డిట్లనుట కాను
ఏను మెచ్చెడి గుణమింత కేదియనఁగఁ
దన్మయత్వంబు కవికి యాధారమదియు. 6

అది కలకవిత్వమే పాతకాళి నొకట
వింతతోడుత నైమఱపించివైచు
నిలను నదిలేని కైత యదెట్టిదైన
ముట్టుకొనరానిదది మఱి నట్టిపిప్పి. 7

ఏను మీసలఁబెంచుట కేతఁడట్టె [illegible]
యాగ్రహించుచు వ్రాసినాఁ డరసికొంటె
సహజకవి, దిట్టకవియు, నీసచివవరుఁడు
మఱియు మితిమించినట్టి యాత్మాభిమాని. 8

కంటె యొకకొంత మునుతు పాకంబులోన
వీఁడు ననుఁ దూలనాడిన నాడుఁగాక!
అన్యుఁడాకాడు చిన్న వయస్సువాఁడు
ఆదరము కలవాఁడు నాయెడఁ జాల. 9

క్షితిని మామక శిష్యప్రశిష్యులఁ బలె
నేను నాశీర్వదించుచున్నాను వీని
నాయురారోగ్య, భాగ్య, మర్యాదలంది
తద్దగానుఁగాక కవితను బెద్దపేరు". 10

ఇట్లు చెళపిళ్లయంత కవీంద్రుఁడొకట
నాకవిత్వంబు వర్ణించినాఁడు చూడ
మిడుత వీవింక మెచ్చియు మెచ్చకేమి?
తిట్లగ్రంథము నీకది తెలుపనేల! 11

కవిరాజనియెడి తోకను
దవిలించిననీవుగూడ ధరియింతువెపో
కవితను దెలియుదు వెట్లా
కవియను నామంబు నీకు కాకికిలేదే ? 12

ఇట్లు వచియింప నీవేమొ యెద్దువైన
నేలవచ్చినదింత నాకెఱుఁగఁజెపుమ !
కవికులమ్మంత యొకట నా కవితకెఱుఁగఁ
దిట్లగ్రంథముగా నీవు తేల్చినావె ? 13

నీవు కవిరాజు వనుమాట నిజమెయైన
వట్టి శుంఠవు గానేల వ్యవహరించి
తందునకు నేను నిన్నట్లు లనఁగవలసెఁ
గాదు పాపమ్మనఁ బోవునే కర్మఫలము ? 14

## భావార్ణవము.

నిన్ను మెచ్చినచో నీవు నన్ను మెత్తు
లేనిచో లేదటందువే? యైనవినుము!
తిట్లగ్రంథమటంచు నీ తెలుపుమాట
కవని నెందఱు నొప్పింతు కవులయందు? 15

కనవె? శ్రీపాద! తుమ్మల కవివరేణ్యు
నతఁడు భావార్ణవము జూచి యనియె నేమి!
తేనె లొలికించు ననఁగాదె తెన్గుఁదనము?
తెలుపవే! యేడఁబోయె నీ తిట్లమాట? 16

అరసితే? యింతకొకట భావార్ణవంబు
చెళ్ళపిళ్ళ మీసములకె వచ్చినదికాదె?
తిట్టుటయె నేను బనిగాఁగఁ బెట్టుకొనిన
వేడ్కపడు నేమొ? చెళపిళ్ళ వెఱ్ఱివాఁడె? 17

ఇంతకును నేను దిట్టిన దేమటంచు?
నమ్మయని తిట్టితిన? లేక యాలిమునియ?
తెలుపవే నీవు నేనిని తిట్లటందు?
చెప్పుటకునైన నింతయు సిగ్గులేదు. 18

అరయ నాధాటికెందు నీవాగలేక
తిట్ల గ్రంథంబటంచని తెల్పుకాని
ఆకవిత్వంబు వచ్చునే నీకునైన?
నట్లె మఱి చెప్పఁజూవ నీయబ్బకైన? 19

తిట్టుట యొండె నాపనిగఁ
దెల్పెద వంతకె నాకవిత్వ మం
దెట్టిది యింక జెప్పునదొ
కించుకయేనియు లేకపోయెనే?
" తిట్టుట నాకు సమ్మతమె
తియ్యని పల్కులు మేల్మిశయ్యయుఁ
బెట్టిన కైత యేని" యను
వేంకటశాస్త్రి హాసింపఁడే నినున్? 20

తిట్టితినె పొమ్ము నేను నీ తెలిపినట్లు
నవని నెవరికిరావె? నాయట్లు తిట్లు
ఓర్చి యెవ్వారు నాతిట్లు కూరకుంద్రు?
తిట్టునకు నన్నుఁ బదితిట్లు తిట్టరేమి? 21

తిట్టులే లేవటంచు వాదింపనేల?
కొన్ని యుండునె గాక నీవన్నయట్లు
కంటె యంతకె యది తిట్లగ్రంథమానె?
యందు నింకేమియును జెప్పనలవికాదె? 22

ఇంతయేటికి కవివెకా యీవుఁ గూడ
నీవును గవిత్వమును వ్రాయనేర్తుకాదె?
చెప్పు మందున నొకతప్పు జిక్కదేమి?
దాన నీకైత తప్పులతడక యనుదె? 23

"అవని మాకీడువచ్చెడి కవులఁ జెప్ప
శూద్రులందునఁ గొందఱఁ జూతుఁగాని
వైదికుల నొక్క నన్నయభట్టు తప్ప
నరయ నందఱు పప్పు బ్రాహ్మణులె కారె"? 24

ఇట్లు చెప్పుట కీవు సహింపనైన
నన్నయార్యునితో నిన్ను నెన్ను నెవ్వఁ
డం దమాత్యుల ముందట నెందుబోలు
దరయ నీవొక పప్పుబ్రాహ్మణుఁడ కావె? 25

కలదు కాఁబోలు నీ కహంకార మొకట
భారతం బేను వ్రాసినవాఁడననుచు
నంత కే నీవు తిక్కనవాఁడ వేమి?
ఔననుట కేఁ గుఱుంగంటిఁ గాను వింటె! 26

వ్రాసితే పోమ్ము నీవును భారతంబు
వచ్చునే యది తిక్కన పర్వమొకటి?
నీదియుఁ గవిత్వమానొకో నిజమునందు
తిక్కనది కైత వ్యాసుని దిద్దినాడు. 27

అరయఁ గేవల మనువాదమాను నీది
యనఁగ గద్యంబుబోలుఁ గాదనుచు నంటె
కాని గణబద్ధ మందునఁ గవిత గలదె?
యొక్కట వచింప నొక్కటి మక్కి గాక! 28

ఇయ్యది నిక్కపుంగవిత
యీ కవనంబును జూచెనేని న
న్నయ్యయుఁ గొయ్యవారిచనఁ
డా యని వెఱ్ఱిమొగాలు పప్పురా
మయ్యలు కొందరన్న విని
యాత్మను బొంగుదె? వక్షగింజలో
బియ్యపుగింజ గాకిది క
విత్వమటోయి! బడాయి గొట్టగన్! 29

ధ్వనిచే ముద్దులుగాఱు భావములు జిం
దన్ ముచ్చటల్ సెప్పుచున్
దెనుఁగుం గబ్బపు ముద్దులాడి మును జ
న్మించెన్ గవిబ్రహ్మ దా
ల్చిన గంటంబున నీయభావకవితా
చిత్రాంగి నీ తిక్కనా
ర్యుని ముందేల ప్రవేశపెట్టెదు? చిరా
యుస్సారదూరీకృతన్. 30

ఇన్ని నాచెప్పుటకు నాగ్రహింతు వైన
దిక్కనార్యుని ముందు నీ లెక్కయేమి?
మాట రా నింక నాకు మోమోటమేల?
సత్యము వచింప నేనింక జంకనేల? 31

పోల్చినాఁడవు నన్నింత బొమ్మవోలె
ప్రాణములులేని బొమ్మనే కాని నేను
పాడునదు నీదు జీవచ్ఛవంబు కంటె
మోహనంబు కదోయి నా బొమ్మమోము ? 32

" జగతి నింకను సామాన్యజనులు గూడ
రాదటందురే కవిత్వంబు వైదికులకు
నేటికో యింత నిరసన మేనెఱుంగ
వైదికులనంగ నెంత నిర్భాగ్యులౌర !" 33

వైదికులనంగ నెంత నిర్భాగ్యులౌర
యనుటయును నీవు దూషణ మన్నెద వైన
వైదికుల భాగ్యమింతకు బాగెయున్న
నేను దౌర్భాగ్యులనిన మీ కేమిపోయె ? 34

మీకు దౌర్భాగ్యులనువారు కారె యేని
ఏది మీ భాగ్యమేపాటి యెఱుఁగఁ జెప్పుడ
బిచ్చమెత్తిన ధనము జూపింప వలదు
జరుగు నీవాక మాంధ్రభాషా ప్రసక్తి. 35

" జిలిబిలిపలుకుల వెలఁదీ !
పలుగాకి నకారగుళ్ల పాలైతిగదే ?
యిలలో వైదికవిద్వ
త్తిలకంబుల కేడి దిక్కు తెలిపితివమ్మా "? 36

ఈ విలాపంబు నచియింపు మెవరిదాను!
తలఁప నింతకు నది వైదికులదె కాదె ?
యిందు దౌర్భాగ్యమే గాక యేమికలదు ?
నలయు నెడ నిల్లె యింకను గలవు వినుము. 37

" చందనశాఖికన్న విర
సంబగు బూరుగు మేలటన్న తీ
విం దగినట్లు వైదికక
విత్వసుధారసధార లెల్ల జె
ల్వొందగ భూతలంబున ని
యోగికవిత్వముతోడ సాటిరా
దందురు బెట్టిదంబగు న
టందురు కొందఱు మూఢమానవుల్" 38

ఈ సుధారసధార లవేవటన్న
గంటె ధరియించి పట్టు పాకము లె కాని
యున్న దింకొక్క మాట నియోగితోడ
వైదిక కవిత్వమది సాటిరాదనంగ. 39

తెలుపుచో మూఢు లిందు వైదికులె కాని
యవని నొకకొంద ఱామాట నరదు కాదె?
వైదికులనంగ నెంత నిర్భాగ్యులనుట
కీవ వచియింపు మింక నా కేమి తప్పు? 40

" వంటలే లోకముగనుండు వైరికుండు"
ననెడి మాటయు దూషణ మనెదవైన
నెవరు గనకుండ నెక్కితే యేన్గు నీవు
ఎక్కినానంచు నీకు నీవేల చెప్ప? 41

ఇంత కరయంగ నేనుంగు నెవ్వరెక్క
రెక్కితే యను మేమిటి కీ బడాయి?
ఈవు వంటలవాండవు కావయేని
ఏన్గు నెక్కండె మురిసిపోయెద వదేల? 42

" వెధవలంబోలె నూరక పేలనేల?"
అనుచు నీ నేను నిన్నంటి వని వచింతు
మొదలింటి తరంగ మందలి దది కనంగ
లేదుగద! యందు నీ మాట లేశమైన? 43

ఏను మావారి విద్యార్థి వేమొ చెప్ప
నంటి కాదే? మహాత్మ్మాతులనుచు నీవ
యాంధ్రభాషమ మాకన్న నధికుడన్న
వాకొన వదేమిటికి నీవు వాని పేరు? 44

ఇంత కారయ యందువ కే కదోయి!
వ్రాయగానయ్యె నాకు నా వాక్యమట్లు
వెండియును నీవు మాటిక పేలితేల?
వెధవవని గాక యయ్యది వేఱయౌనె? 45

ఎవని పట్టను జెళపిళ్ళ యెట్లయున్న
నెఱుఁగఁ డంటివి నాపట్ల యింత నేర
మిట్ల యడిగెద నేను నీకేమి చేసి
తీవు నామీఁద నేల దండెత్తినావు ? 46

నీ వొకండవు నన్ను మన్నింపు మనియు
వెండి కవిరాజుగా గౌరవింతుఁ గాని
ఏననను గాదె నిన్నుఁ బల్లెత్తుమాట
నరయగాలేదె? నాదు భావార్ణవంబు ? 47

"కొంచెమందున నను గౌరవించె నైన"
జాలు నామాత్రమే నీదు సాక్ష్య మిచట
జగమెఱుంగును వైదిక జాతి మాట
నిప్పు డద్దాని గోత్రగఁ జెప్ప నేల? 48

ఏను నిన్నేమి యనమంట యెఱిఁగియెఱిఁగి
యీవు నామీఁద దండెత్తినావు కాదె?
చెళ్ళపిళ యేమి నేరంబు జేయఁడనుచు
నే నతనిమీఁద నేల దండెత్తరాదు? 49

ఈవు నాజాతి నిరసించి నావు కాన
వారిలో నేను జేరినవాఁడ ననుదె?
జాతిని దిరస్కరించుట జగడమైన
నేను నీపేరు గొనియాడ నేల? చెప్పుమా! 50

అట్లు కాదోయి శ్రీపాద! యిట్లు యేద్వా
మీవు నాతోడి కయ్యంబె యెంతువేని
ఏను వారిని జేర నాకిష్టమనుము
అందు నాకును నేమి భయంబు లేదు. 51

ఈవు వారిని జేరుట కేమి కతము
యెఱుఁగుదును నేను శ్రీపాద! యెంతయేనిఁ
జెల్లపిళ్ల యంతటి మగండు చేష్టలుడుగ
నేను భాషానియంతను నెదిరి తనియ. 52

అంత కే నీవు కడు సంతసింతువైన
దాన వచ్చు నపాయంబుఁ దలఁపవైతి
వను భవింతువెపో నీవు నాఫలంబు
నెవనిగా నెంచినాఁడ వీ వేననంగ? 53

భాషయందున నాతో వివాద మనిన
భంగపడిపోవు నంతటి బ్రహ్మదేవుఁ
డీవు మానవమాత్రుండ వెఱఁగికొంటె
యెంతవాఁడవు నీవు నాకేమి లెక్క? 54

ఎఱిఁగి యెఱుఁగక యది యెట్లయేని గాని
గౌరవించితినే పూర్ణ ఘనుఁడ వనుచుఁ
దలఁప నీ గౌరవము నీకుఁ దగని దైన
నీవ చెప్పుము దాని కే నేమి సేతు? 55

చేసెనో లేదో నేరంబు చెల్లపిళ్ళ
దాని వచియింప నేటికి దైవమెఱుఁగుఁ
బేరునకుఁ బోయి నాయందు నేర మిప్పు
డీవు మాత్రంబు చేసితి వింత నిజము. 56

ఇంత నీపేరు నాకు లేదే యటన్న
నున్న చో నీకు నాతోడి యుద్ధమేల?
అందునను నన్నుఁ బిల్లవాఁ డంచు నీవ
పిల్లవాని గణించునే పెద్దవాఁడు? 57

ఏను నీకు బుద్ధి నెఱిఁగింప వత్తునే
కాని యుద్ధమునకుఁ గాదటన్న
నీకె బుద్ధి మొదట నిండుసున్నను బోల
దాని నాకుఁ జెప్పఁ బూని తెల్లు? 58

మీసలింతకుఁ జెళపిళ్ళ దోసమనియుఁ
దొలుత నొక వైష్ణవుని జూచి దువ్వఁగాక!
దాన నా కూరకుండుట ధర్మమానె?
యరయ నీయాంధ్రభాష నాయదియె కాదె? 59

ఏమి శ్రీపాద! వచియింపు మిప్పుడైనఁ
దెలియవచ్చెనె నాదు వ్యక్తిత్వమేమొ?
చెళ్ళపిళతప్పు నాపట్ల జేయకున్న
నాతనిని నేను శిక్షింప నౌనుగాదె? 60

వాద మేదియొ నెత్తిపై నెచికొనియు
వ్రాసి నావంటి కాదె భార్గవనంబు!
రోత యుంటివి మఱియు నా వ్రాత యేమొ
యింకఁ జెప్పుము రోత యుందెవరి వ్రాత? 61

అప్పుడొక చెళ్ళపిళ్ళదే తప్పు గాక
యీవు జాతిని నిందించి తేటి కనుదె!
కంటె కొపరింపు కవులనే కాని యూకఁ
డోపకుండక పోడె నియోగి జాతి? 62

అరయఁ జెళపిళ్ళ యింటికీ వన్న యట్లు
కొందఱనె జూచి కాకులు కూయుఁగాక!
అట్లనుచు నేను నీజాతి నాడ నేల?
నేనెఱుంగను నాకది నియమమెట్లొ. 63

కలఁడు భార్గవరాముండు కనుగొనంగఁ,
జేసిరెందఱు రాజులు చెట్ట యతని,
కతఁడు తజ్జాతి నేటికి మాత్రము గొనియె!
జెప్ప వేమిటి కది నీవు తప్పటంచు? 64

అతఁడు రాజుల పాలింటికైన రాముఁ,
డేను మీపాలి కవిరాముఁ డైనవాఁడ
గండరిగొడ్డలి యతనిది కలము వాది
యొకట వచియింప నిదియు దానికిని మిన్న 65

అర్జునుఁడు తొల్లి జమదగ్ని యన్నము దిని
యతని ధేనువు బలిమిమై యపహరించె
వైదికులు మేము గ్రక్కిన భాష మెక్కి
తుదకు మీసాలు మామీఁద దువ్వినారు. 66

కార్తవీర్యాత్మభవులు భార్గవున కోడి
యతని తండ్రిని జమదగ్ని నడచినారు
వైదికులు మంత్రులకు దలవంచి తొల్లి
చంపినారలు నేఁడు కొవ్రింపు కవుల. 67

రాముఁ డింటలేక రాజాత్మజులు వచ్చి
తఱిగి నారలు జమదగ్ని తలను
బూర్వ మంత్రి లిపుడు భువిని లేకుండుట
మీరు కొప్పరంపు వారినొంత్రి. 68

అద్దిరయ్య! శాస్త్రులాంధ్రభాషను మీస
ములను బెంచి దువ్వఁ గలిగినారె?
వారు మా నియోగివారి నారయ గొక్కో
యే నమాత్యుఁడౌట యెఱుఁగరొక్కొ? 69

తండ్రిఁ జంపు పగను దగనికోపల్లబున
రాముఁడోమి న్నాఁడు రాచకులమ్ము
కొప్పరంపు కవుల నొప్పించుటకు నింక
బాడుసేతు నేను వైదికులను. 70

దోసమన నుండు చెళపిళ్ళ మీసములకు
నెంద ఆతని మీవారు మందలింతు?
మీరు వారిని జేరినవారె కాదె?
యెదిరికొనవేల నీజాతి నిక నేను? 71

చెళ్ళపిళ మంత్రికులము దూషింపఁడంటె
దూషణము లిప్పు డేనేల దోఁపఁజేయు?
జెళ్ళపిళమంత్రికులము దూషింపఁడేని
యెవరు వ్రాసిన దీ పద్య మేలవచ్చె? 72

పగ మీకెవ్వరితోడఁ గ
లిగె? వారల మగటిమిం గెలిచి సత్సభలన్
బొగడొందవలయుఁ గాకా
తెగనెల్ల నకారణముగఁ దెగడం దగవే? 73

వర్ధు సూర్యనారాయణ వ్రాసెదిని
సీమలను జూచి ప్రశ్నించుఁ జెళ్ళపిళ్ళ
నొసఁగ వేమిటి కిందుఁ బ్రత్యుత్తరంబు?
మగనిఁ గొట్టుచు మొఱవెట్టు మగువ యౌదె? 74

చెళ్ళపిళ మంత్రికులము దూషించె ననఁగ
వలయుచో నెవ్వ యేనియుఁ బట్టియిత్తు
నెందునకు వచ్చె వాని నీవెఱుఁగ వేమి?
చాలు మీసలపద్యమే శాస్త్రివర్య! 75

ఓయి శ్రీపాద! యింత కీ వాఁకఁడ కాదు
* గొల్లపూడియు నిట్లె వాకొనెను వినుము!
జగతిఁ గొప్రింపుకవ్యాత్మ శాంతి కంట
యేను మీ శాఖపైన దండెత్తినాఁడ. 76

అరయ మీఁ దాత్మశాంతికై యనెడు మాట
యుండుఁగద వారల కశాంతి యొందు దీన
నేను మీ శాఖపైన దండెత్తనేని
ఈవ చెప్పవె? వారల కేది శాంతి? 77

ఇంకఁ దమమీఁద నేను దండెత్తుమాట
యది యనాలోచిత మటంచు ననె నతండు
వారల కశాంతి మీరు గూర్పంగవచ్చు
దానిఁ గాపెడి పని నాకుఁ దగదు కాదె? 78

ఎంచితే యింక నీ తగవెపుడో జరిగి
గలసిపోయినదంట పో కాలగర్భ
మయ్యరే! యిందు నాకు నేమనఁగవచ్చు!
వైదికులఁ దప్పుకొనఁగఁ జెప్పంగ నొప్పు. 79

సత్య మీ తగవెప్పుడో జరిగెనుట
కలసి మాత్రము పోలేదు కాలగర్భ
మట్లు పోయినరాదు భావార్ణవంబు
నోటిమాటలె పోవ నా నాటితోడ? 80

* రామకృష్ణశాస్త్రి.

" తనువున విఱిగిన యలుగుల
ననువునఁ బుచ్చంగవచ్చు నఱి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా?"

అనెడి యార్యోక్తి యుంట నీ వరయు వేమి?
మనసు నాటిన బోవంట మాటలైనఁ
దగవు లయ్యావి యింక గ్రంథముగనుండఁ
గలసిపోయిన వెట్లొకో కాలమందు? 82

కన్నులుండియుఁ దను బోంట్లు కానకున్న
గానరే యెల్లవారు మీకరణి నొకట
కామిలారోగి పచ్చగఁ గాంచుఁగాక
జగతి నంతట నున్నె పచ్చందనమ్ము? 83

కానని వాని నూఁతఁగొని
కాననివాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగి మిమ్మ్ములమ
గైకొని కొందఱు మూఢమానవుల్
గానరుగాక కన్నులను
గల్గియుఁ గానఁగవచ్చు వానివిన్
గానరె? మిమ్ముకింతయును
గాననివారలు సీమగ్రంథముల్! 84

ఇస్సిరో! వాని మాటమీరెఱిఁగి యెఱిఁగి
గలసిపోయినవందురే కాలగర్భ
మిట్లు పచ్చియబద్ధంబు నేడ్చుకంటె
ననుఁ బ్రసన్నునిగాఁ జేసికొనఁగ రాదె! 85

నేఁ డొకండిట్లు నాబోటివాఁడు రాను
బ్రతికియును నేల జచ్చినవార లౌదు
రింతకును మించి నైచ్య మింకేమి కలదు?
లేదె! యీ మాత్రమేనియు వైదికులకు! 86

నేను దగవులఁ గెక్కరించితి నటంట
కెక్కరించిన మీరేల నక్కపోవ
నందునకుఁ గూడ నాకు మీయాజ్ఞయేమి?
యరయరో నన్ను భాషానియంత యనఁగ! 87

ఇంతతోడుత నైపోయె నేమి? చెప్పుడ!
తప్పుకొనఁ జాతుమన్నను దప్పదయ్యె!
ఆంధ్రభాషను సీమ ఉన్నంతవఱకు
వైదికుల కున్నయవియెపో వ్యథలు వ్యథలు. 88

చెప్పు నెవ్వండు గుంటూరి సీమ లరసి
వైదికుల నేను గాఱింప రాదటంచు?
నవుర! యిద్దఱ క్రొంపు కవులమీఁద
నెత్తి యున్నారుగుచు కూడి వత్తురేమి? 89

అట్లు వచ్చెడి యరిసమూహంబు గొనకఁ
బోరుగావించు నన్న వమ్ముల నయారె!
చంపుదురె? సాటి మంత్రులు శల్యు లగుచు
ననుభవింతురె? వారు కర్ణుని యవస్థ. 90

అరసిన వైదికులు పూర్వవైర మెంచి
కడఁగిరే గాక క్రొంవు కవుల నడఁపఁ
జేర నౌనె? నియోగులు వారిలోన
నింత యన్యాయ ముండునే యెందు నైన? 91

ఎంచితే యన్నిటికి మించి యిదియ యొకటి
నామనంబును దహియించు నేమి సేతు?
దీని బాపఁగ నిల్లె వైదికుల తోడ
మంటఁ గలుపుదునే యింక మంత్రి కులము? 92

ఏనొక నియోగి ననఁగ నీ యిల జనించి
జాతి నడఁపఁగ నౌనె? నా చేతులార!
అడఁప కున్నెడ నా కోప మాఱు నెట్లు?
దక్కెఁబో మంత్రికులము పోతననుఁ జేసి. 93

ఇంక భావార్ణవము వ్రాయుఁ డేమనంగఁ
గంగితాల ఖరా బని వాగె నతఁడు
ఈవు నావ్రాఁత రోత యంచేడ్తు కాదె?
యిర్వు రొక తండ్రి బిడ్డలే యింక నేమి? 94

ఔను నావ్రాఁత యనిన మీ కట్లెగాక
ఒసఁగఁ దరమా నె యుండుఁ బ్రత్యుత్తరంబు?
నెందున నశక్తదార్జన్య మెంచు వారి
కింతకును మించి యేడ్చ్వనదేమి కలదు? 95

ఎంచి చూచిన మీకసి యిట్లె గాక
తీఱుఁ నెట్టుల చెప్పఁడా వేఱు భంగి?
నవని నీమాట శాస్త్రిపుంగవులె గాక
యింక నొక్కండు చెప్పునే యెందునైన? 96

కంటె యీమాత్రమును జేతగానివార
లేమిటికి వ్రాయవలయును నీవు లట్లు?
తెలుపరే! నేఁడు నాకు బోధించు బుద్ధి
యొంచుఁ బోయెను నాఁడు మీ కేల లేదు? 97

ఇంక నారచనంబు నకెందుఁ కొఱకొ
కొంత మెచ్చుచు నున్నాడు గొల్లపూడి
తలఁప నేమిటి కామాట దాని కేమి?
జగ మెఱుంగును నాకైత చక్కఁదనము, 98.

అరయ నా కింత ముత్తమం బైనరచన
మంచి దని చెప్ప వచ్చెఁబో మఱియు నాతఁ
డాహహా! హహా! మీ నీమరచన మత్యుత్తమంబు
పాడు రచనంబు నాదు భావార్ణవంబు! 99

అయ్యారే! యింక దేశపాండ్యా యనంగఁ
గరణమను నర్థమును జెప్పఁ గడఁగినావు
వట్టి శుంఠవు నీవు శ్రీపాద! వినుము
పండితుఁడు దేశమున దేశపాండ్య యనఁగ. 149

పండితపదంబు పాండ్యగాఁ బరఁగుఁ గాని
కరణమని చెప్ప నర్థ మొక్కరణిఁ బొసఁగుఁ
దెలియ కున్నాడఁ దెలిసి కోవలయుఁ గాని
యీకె తోకయు లేక వచింపనౌనె? 150

అరయు నెడ నొక్క నియ్యోగి నౌదె తప్ప
నేను నీవన్న కరణంబుఁ గాను శాస్త్రి!
కంటె కరణీకమును వృత్తి కాదు నాకు
వలసియున్నాడ నాసఫీ వంశమునకు. 151

మా ప్రభుత్వమునందున మంత్రులొకట
యేగుచుందురు తమదారి నేను జూడ
నేను నట్లేగువాఁడను గాను వింటె!
యుందు నే నాసఫీ వంశ ముందువఱకు. 152

నేఁటి నాస్థితి నెట్లయెంచిన నదేమి?
యాదరించితి మంత్రినై వైదికులను
నగ్రహారంబు లెన్నొ యనుగ్రహించి
కలదు శ్రీపాద! చూడు మాంధ్రుల చరిత్ర. 153

రోస మందుట నేను నీ మీసములకు
మీసము నియోగి చాటనే కూసినాఁడ
వోపితిన యేని యిమ్ము ప్రత్యుత్తరంబు
మీసము నియోగి దని యేఁడవ్రాసి తేను? 105

సంతసంబున కీవు మీసంబు లుంప
రోస మందితె నేను నీ మీసములకుఁ?
జెప్పు మోశాస్త్రి! యామాట నిప్పుడైన
బ్రతికి పోవంగవచ్చు మీ వైదికులకు 106

ఉర్వి నెవరికి నీమీస లుండనట్లు
పెట్టినది మీరెకద * కొజ్జమట్ట లగుచు
నింక నన్నాడ నీకు సిగ్గేల లేదు?
నవ్వరే నిన్ను శ్రీపాద! నలువు రోకట? 107

చాలుదని యింక రొయ్యమీసంబుఁ జెప్పి
యిందు నొక యర్ణనము వ్రాయు దేమొ యంటి
వయరె? మీవైదికులు రొయ్య నరసి యేన
మీసములు బెంచినారలు రోసమొప్ప? 108

అట్లు క్రొత్తగ మీస లీవందు కతన
రొయ్య మీసంబులకు దాని రోతుగాని
నాదు మీసంబు లరయ యీనాఁటి వౌనె?
రొయ్య మీసంబు లేనేల రోయవలెను? 109

*"బలుపు"న కర్థము.

బుద్ధిజాడ్య మనెడి పోని యున్మాదంబు
శ్రోత్రియుఁడవు నీకు సోకుఁ గాని
లౌకికుండ నేను నాకేమి చెప్పెద
వేను నిన్నుఁ బోలు వానిఁ గాను. 110

ఇదియు దూషణ మని వచియింతు వైన
మిమ్ముఁ బలె దువ్వనే రొయ్య మీసములను?
ఇంక నొక యర్ణవంబుఁ జే నేల వ్రాయ?
నేమొ వ్రాతువా యంచు నీ వేల కూయ? 111

చెప్పితివి నాది బాలచేష్టిత మటంచుఁ
జెల్లు నెల్లని బాలచేష్టితము జగతి
ముసలి తనమందు నీకు నీ బుద్ధి యేల?
యెందునకు వచ్చె నీవాద మెవఁడు మెచ్చె? 112

వెక్కిరించెద వే నన్ను నిక్కి నిక్కి
వెల్లకిలఁబడి నాఁడవా వెక్కిరించి?
నేను చేయూత నిచ్చు చున్నాను లెమ్ము.
నవ్విపోదురు చూచిన నెవ్వరైన? 113

ఇంక మీసల పద్య మే రెఱుఁగ రనఁగఁ
జెప్పితి నియోగులను నిరసింప దనుచు
నిందు నీకు భాషాజ్ఞాన మే హుళక్కి
ఎఱుగఁ గవిరాజు బిరుదు నీ కిచ్చి రెవరొ? 114

ఇంత నాఁడంత వాని నీ వెఱిఁగి యెఱిఁగి
యిట్లు టందువె యని యాగ్రహింతు వైన
నట్టి మీసల పద్య మీ వరసి యరసి
యిట్లు నీకు వచింపఁగ నేల? చెప్పుమ! 115

తలఁప మీ మీస లౌక నియోగులనె యేమి
ధిక్కరింపవె యీ యెల్ల తెలుఁగు కవుల?
నొకట నయ్యావి మీదు వైదికుల వగుట
నీవు వారినిఁ జేరు డీవెఱుఁగ వయ్య! 116

" దోసమ టంచెఱింగి యును
దుందుడు కొప్పఁగఁ బెంచ రేమి? మీ
మీసము రెండు భాషలకు
మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా
రోసము గల్గినన్ గవివ
రుల్ మిము గెల్వఁగ నౌనుఁ గాదె? యా
మీసము దీసి మా పదస
మీపములన్ దల లుంచి మ్రొక్కఁగన్ 117

ఇందునకు నాంధ్రకవు లెల్ల హీనులగుచు
నూరకున్నారలే గాక యూరకొనిన
వారి బోలెనె నేనెట్టు లూరకుందు
నుందు నీభాష మా యమాత్యులది గాఁగ! 118

దేశ భాషలందు దెనుఁగు లెస్సగ నంట
నా సిఫారసున నేఁ జేసి యుంట
తెలుఁగుభాష యింత వెలుఁగొందుటకుఁ గూడ
నా కలంబె కారణమ్మ టంట. 119

తెలుఁగటన్న నన్ను వలన నే పుట్టిన
దున్నరియుఁడు నేఁడు నన్నుఁ జేసి
నాదు పోక యుడిఁయు నశియించి పోవును
బోలు దేను మూఁడు మూర్తులకును. 120

మీసములు రోస మూపాఱి మీకె గాని
యివ్వఁడే భగవంతుఁ డింకెవ్వరికిని?
యొకఁడు ముందైన జన్మింప కుండు నేమి?
యేమిగా నెంతురి వైదికు లింత కోకట? 121

అరయ నిందున నీవు నన్ననుట కన్న
నాడనగుఁ జెళ్ళపిళను నన్నయనుఁ బోలె
వైదికుల నీవు జేరెడి వాఁడ కాని
యతని మాత్రి మొకింతయు ననవు కాదె? 122

" ఇందు నామీస లింక నేమేని యనిన
నేనుఁ జెప్పఁగరాని కొన్నింటిఁ బెంతు
దోస మననేల పీకుత రోసమున్న?
మీఁదఁ జూతము రెండవ మీసమేమొ" 123

ఇందు జెప్పఁగ రాని వవేవటంటి
చెప్పటకు నాకు నవ్వువచ్చెడి నటందుఁ
గానరాదేమి చెప్పగ రాని వనుట?
యేవియో యవ్వి నీవ యూహించికొనుము. 124

అట్టి నీ చెప్పఁగారాని వనెడివాని
మీసలుగ బెంతువా? యంచు నే[illegible]
తేను నా చెప్పఁగా రాని వానితోడఁ
బోల్పుచున్నాను మీ మీసములను వింటె? 125

మీసముల బెంచి మీరలు రోసమున్న
గెలువుఁడని మమ్ము కవులను బిలువరేమి?
అట్లు నా పెంచు వాని మీ కలయఁ జేసి
నన్ను గెల్వఁగఁ జెప్పుచున్నాను నేను. 126

ఒకట నిట్లొప్పియుండు వెండ్రుకలగొడవ
క్రిందు మీఁదును గానని దందు వయిన
జగమెఱుంగదె నీదుమీసముల గొడవ?
కంటె యది కన్న మిన్నెఱుంగనిది కాదె? 127

ఇట్లు వ్రాయుట తగదంటి వింక నాకు
నట్లు వ్రాయుట తగదు నీ కందు నేను
నీదుమీసలఁ గొడవకే కాదె? శాస్త్రి!
[illegible]డెను నీ వృత్తిమీఁద నా గొడవ నేఁడు. 128

కత్తిబట్టితే? మనుచుఁ జాగ్రత్త యంటి
కలము బట్టితి వలసిన కత్తి బట్టు
దీవు నను భయ పెట్టు చున్నావు కాదె?
జంకదో శాస్త్రి! సింహంబు జింకఁ జూచి. 129

ఉత్తరకుమార ప్రజ్ఞ లేవో వెలార్చ
నవ్వనంటివి లోకంబు నన్నుఁ జూచి
నన్ను లోకంబు నవ్విన నవ్వుగాక
నేను మాత్రము నినుఁ నవ్వినానొ శాస్త్రి. 130

ఇల నమాత్యులతో సరి యెవఁడనంగ
నిల్చువారి శక్తి బట్టి వచింతు వంటి
నేను వచియింపఁ జాలుదు నెట్లయేని
లేదు ప్రశ్నింప శక్తి మీ వైదికులకు. 131

ఇందు నీకెంత తామస మేటికయ్య?
యరయ నా గ్రీకి—నది కాదె యాంధ్రభాష?
మఱచితో చెల్ల! యిప్పుడు మతికివచ్చెఁ
దగిన దుచ్ఛిష్టమే కదా! తామసులకు. 132

అట్లమాత్యులఁ గూర్చి నే నాడినట్లు
నీవు మీవారి వచియింప నేర్తు కాదె?
ఎవఁడురా? వైదికుల మమ్ము నీసడించి
గంటెఁ ద్రిప్పుట కగు మొనగాఁ డటంచు. 133

అట్లు కాదేని నీకు ధైర్యంబె యున్న
జూచెదను నేనుఁ జెప్పుమీ చొప్పునైన
ఏనురా మీ యమాత్యుల నీసడించి
కలము నడుపుట కగు మొనగాఁడ ననుచు, 134

కలమనిన నోడ కాదుగా తెలుపుమంటి
గంటె మాత్రము కాదోయి! కలమటన్న
నాకు నీ యాంధ్రభాష యర్ణవ ముగాఁగ!
గలమునకు నోడ యర్థమ్ము కాదదెట్లు? 135

ఇట్లు మీ బోంట్లు నను వచియింతు రనియ
కలమునకు నర్థ మోడగా బలికి తెపుడొ
కల్ల కానేర దిద్ది జగం బెఱుంగు
నెందు బోయెద వింక నీ కేది దారి? 136

ఏమొ ననుఁ బోలెనే పాప మీవు గూడ
గంటె యను కొంటి వేమొకో కల మటన్న
కలమనఁగ నెప్పుడును గూడ గంటె కాదు
ఎఱుఁగుమెన్నఁడు నిది వంట యిల్లు కాదు. 137

ఏనె తిక్కన పోతన నేనె యనుచు
నన్న యట్లుగ వచియింతు నంటి మఱియు
నడుగు చే నందు నీకేమి కడుపునొప్పి?
వారు నీ తాత చుట్టాలు కారు కాదె? 138

ఇంక నీ యాంధ్రభాషయే యేననంగ
నేమొ కన్నెఱ్ఱ జేసెద వెందు కొఱకు?
నన్నుఁ బలెనే వచించెఁ దెన్నాలివాఁడు
వాని నేమంటి వీవు శ్రీపాద! చెప్పుము? 139

అతని రూపంబు శారద యయ్యె నేని
యింక నారూప మాయమై యేల కాదు?
అతని మించిన వాని నేనగుచు నుండఁ
జెప్ప నేమిటి కీ మాట సిగ్గు చేటు. 140

నాకొకఁడు సాటి యీ మూఁడు లోకములను
లేడటంచని మఱియు నే నాడితంటి;
నేఁడును వచించుచున్నాఁడ లేడు లేడు
గడన కెక్కిన మంత్రి మల్లుఁడను నేను. 141

ఇంక నామీఁద వచ్చు వాఁడెవఁడో వాఁడు
భస్మమైపోడె యనుచు నేఁ బలికితంటి
మార్కొనఁగ రమ్ము నీకు సామర్థ్య మున్న
భస్మ మొనరించెదను నిన్నుఁ బంత మొప్ప. 142

పంత మేటికి? భావార్ణవంబుఁ జూడ
గూడె నా మేనటంచు నీ వాడ వేమి?
చాల దే! సాక్ష్యమింత నా శక్తి కరయ?
వేఱ భస్మంబుఁ జేసి చూపింపనలెనె? 143

పెద్దగా నేను నిను గౌరవించి నపుడె
చూడ నమ్మోయి నీ మేను సూడునేవి
ఈవు నన్నాడ నేను గన్నెఱ్ఱఁ జేయ
సత్యమే కాదె! నీవు భస్మంబ వగుట? 144

ఏమి శక్తి జూచి యిట్లాడెనో యంటి
నాకు శక్తి యేమి లేకయున్న
నెనుబ దేండ్ల ముసలి వింకను గవిరాజు
వీవు నన్నుఁ దాఁకి నావదెట్లు? 145

చందమామ రావె! జాబిల్లి రావె యం
చాడుకొనెడి పిల్లవాఁడటంటి
నట్టి వానితోడ నాలంబుఁ జేతువే?
చెప్ప నీకు సిగ్గు చేటు కాదె? 146

అంటి వీ వింక దేశపాండ్యా యనంగ
నీవు కవిచక్రవర్తి వయ్యెదవొ యనుచు
నైదికుఁడ వీవె కవిచక్రవర్తి వౌదు
వే నియోగినె వంటలవాని నౌదు. 147

అరరె! నీవిట్లు దేశపాండ్యాను బట్టి
యేమి యనుకొంటి వంచేమొ యేత్తుకాని
మఱచిపో నేమిటికి నన్నమాత్యుఁ డనుట
ముందున గుఱించి యీమాట నడుగ వేల? 148

అయ్యరే! యింక దేశపాండ్యా యనంగఁ
గరణమను నర్థమును జెప్పఁ గడఁగినావు
పట్టి శుంఠవు నీవు శ్రీపాద! వినుము
పండితుఁడు దేశమున దేశపాండ్య యనఁగ. 149

పండితపదంబు పాండ్యగాఁ బరగుఁ గాని
కరణమని చెప్పు నర్థ మెక్కరణిఁ బొసఁగుఁ
దెలియకున్నాఁడ దెలిసి కోపలయుఁ గాని
యీకె తోఁకయు లేక వచింపనౌనె? 150

అరయునెడ నొక్క నియోగి నౌదె తప్ప
నేను నీవన్న కరణంబుఁ గాను శాస్త్రి!
కంటె కరణీకమును వృత్తి కాదు నాకు
వలసియున్నెడ నాసఫీ వంశమునకు. 151

మా ప్రభుత్వమునందున మంత్రులొకట
యేగుచుందురు తమదారి నేను జూడ
నేను నట్లేగువాఁడను గాను వింటె!
యుందు నే నాసఫీ వంశ ముండువఱకు. 152

నేఁటి నాస్థితి నెట్లు యెంచిన నదేమి?
యాదరించితి మంత్రినై వైదికులను
నగ్రహారంబు లెన్నో యనుగ్రహించి
కలదు శ్రీపాద! చూడు మాంధ్రుల చరిత్ర. 153

నేఁటి విశ్రాంతి సమయమ్ముం దేఱదెంచి
నవ్వుచుంటివె నను గరణం బటంచు?
నందునను నీవు దుఃఖింప నౌను సుమ్మె
గోముఖ వ్యాఘ్రములు వైదికులు నిజమ్మె. 154

గోముఖ వ్యాఘ్రములు వైదికుల రటన్నఁ
తోకఁ ద్రొక్కిన త్రాచుగాఁ ద్రోఁచినాఁడ
వీ నియోగి యన్నంబున మేను బెంచి
నవ్వవచ్చునె? నను గరణంబటంచు! 155

కయ్యమున కియ్యకొనె నేదన్ను గరణమనుటఁ
గరణమనువాఁడు నీకొక గతిక యగునె?
వారు కరణీకములను గొన్నారు గుత్త
అరయఁ గరణంబె కాదె గ్రామాధికారి? 156

ఉన్న కరణంబు లందఱు నొకట లేవ
కదలిపోవవె? రాజుల గద్దె లట్లు
వారితోఁ బగ నెవరికిఁ బనికివచ్చు?
కాటికిని బోయి దీర్తురు కాదె వారు? 157

నామదికిఁ దట్టు 'భావసంచారి' యిచట
వాఁడు నయ్యాటలాడును వారితోడఁ
గరణ మొక్క సర్వేరాళ్ళఁగాదు కాదు
మాయ మొనరించు జగమును మాటలోన. 158

చుట్టఁ గాల్చెడి యూశేవి చూచు నెడలఁ
జర్చిలును వారి దర్జాకు జాలఁడంట
చాలనిది వాఁడు వారి దర్జాకు గాదు
ధీబలానికి జాలఁడు తెలిసికొంటి? 159

ఏ ప్రధానిని వీఁడెలుఁగెత్తి చెప్పె?
వాఁడు నేఁడేఁ గేఁగద! పదభ్రష్టుఁడగుచుఁ
గాలమును నాకుఁ దోడ్పడె మేలు! మేలు!
నవ్వెదనుగాక! భావసంచారి నేను. 160

ఏను నొకనాఁడు కాలిపోయెద నటన్న
నపుడు సర్వము సంపూర్ణమగు నటంటి
వయ రె! మీ సంతసంబు నే మనఁగవచ్చుఁ?
దీటనే యంతతోఁడ వైదికుల పొట్లు? 161

అరయ నింత కేను గరణంబుఁ గాకున్న
నా నియోగిజాతి వానిఁ గానె?
కాటి కేఁగనిమ్ము కరణంపు పగపోన
దనెడి మాట నీవు వినవె? శాస్త్రి! 162

ఇంక నప్పుడు చేయున దేమటంటె
కనవె? శ్రీపాద! కోప్రింపు కవుల చావు
ననుభవింపుచు నిశ్లేటి చడుగుచయ్య?
యింక నేఁగాలిపోయి మిమ్మేమి సేయు? 163

" కాలి చల్లారు కొప్రింపు కవుల చితులు
మఱల నీ నాఁడు నాలోన మండు చున్న
వేనెఱుంగను గద దీని కేమి కతమొ!
యింక నా చితి నెవని దహించునేమొ!" 164

అనుచు నా వ్రాయు పద్య మీ వరయలేదె?
నాకుఁగాఁ బుట్టకున్న యేనాటి కొకఁడు?
గొడ్డుపోయినదే తెల్గు గడ్డ యపుడె?
వాఁడు తన ప్రాణముల నాకు నీఁడె? శాస్త్రి! 165

ఏ నశాంతిని మరణింతు నేని భువిని
బుట్టుదురు వెండి తిక్కన పోతనలరు
కాదు సంపూర్ణ మెప్పుడు నా కాలిపోవ
వారి పుట్టుక నాను శ్రీపాద! వింటె? 166

వసుధ నింకను గొన్నాళ్ళు బ్రతుకు దేను
జాల యున్నది నామీఁద జాతిఋణము
కనఁబడెద వీవు కాటికిఁ గాళ్ళుసాచి
నేను జూచెద నీచావు నిక్కవంబు. 167

ఇట్లనఁగ నీవు ననుఁ జంపుదే! యటంటి
కాదు నా భావమద్ది శ్రీపాద! వినుము
ఈవు జచ్చెద వని యెద నేను జూడఁ
జావకుండక బ్రతుకుదే జగతి నెపుడు! 168

ఈవు, ఘాత్రము జాకుందువే? యటన్నఁ
జావనని నేను జెప్పను శాస్త్రివర్య!
చచ్చెదను గాని నీముందుఁ జావ నేను
బ్రతుకువాఁడను నీ చచ్చువఱకు నిజము. 169

ఏమొ నా చూచుచుండఁగ నీవె చచ్చి
యేనె యావల జాకూడదే? యటన్న
నిజము నీ మాట చేతిలోనిదియె బ్రతుకు?
ఏనె చచ్చెదనో యేమొ యీవు చూడ. 170

నా వచించుట శ్రీపాద నవ్వుకొనుకై?
ఏను నవమాన మింత సహింపఁజాల
బ్రహ్మ నీ ముందు నా చావు వ్రాయ నిమ్మ
బ్రతికెదనుగాక! నీ చచ్చువఱకు నేను. 171

వ్రాయ నిమ్మని నే నిప్పు బలుకనేమి?
వ్రాసినాఁడట యట్లె యా పాడు బ్రహ్మ
తెలిసె నీమాట పోతన వలన నేఁడు
చెప్పినాడంట బ్రహ్మ యాచొప్పుఁ దనకు. 172

అయిన నీవెట్లు బ్రతుకు దం చడుగుదేమి?
పట్టితిఁ బ్రతిజ్ఞ నట్లింక బ్రతుకు కొఱకు
అంత మాత్రము లేదె నా కాత్మశక్తి?
చూతు నీముందు నను జావు పోకునెట్లొ? 173

ఇప్పు డీ మాట లాడఁగ నేమి ఫలము?
నీవు నాచూచుచుండఁగఁ జావ వేమి?
అయిన నీవచ్చునాఁడె నే నడుగువాఁడఁ
జెప్పెడిని గాక నాకు నీ చితియె బదులు. 174

ఏను నాచావు నట్లు వచించు పట్ల
నద్ది లౌకికుని వ్రాఁతయానా? యటంటి
కాక బ్రతుకుదురే యెల్లకాల మొకట?
ఏమి చెప్పితి శ్రీపాద! యెఱుఁగరాదు. 175

ఇంతకును నీవు నాచావు నెంతుకాని
యెల్లి రానున్న నీచావు నెఱుఁగవేల?
నాది లౌకికుఁ డనుమాట కాదుకాని
వైదికుని బుద్ధిజాడ్యమే కాదె? యిద్ది. 176

ఏను మరణింతునను భయ మింతగొనను
జావు పుట్టుక లిల సహజంబు కాన
నా యనంతర మీ కైత వ్రాయు నెవ్వఁ?
డనియె చింతించెదను నిద్దురను మునింగి. 177

ఏను శుష్కించి పోవుచున్నానటన్న
నలరు నారక్తమంత భావార్ణవమునఁ
గాలి నామేను మన్నునఁ గలసిపోని
నాదు రక్తంబునకుఁ జావు లేదుకాదె! 178

నినుఁ బ్రతిఘటించు వారినే యనుటగాక
ద్రవ్వినా వంటి కాలు నందఱును జూచి
యందునకును సమర్థుఁడ నౌదుఁ గాని.
నేను మిముఁ జూచియే త్రవ్వినాను గాలు. 179

" అందఱు" నటంచు నీవు నన్నందు కాని
మీరె యందఱుఁ గని త్రవ్వినారు కాలుఁ
ద్రవ్వుటలు కాదు మీసల దువ్వినారు
జగమెఱుంగును నీ మాట శాస్త్రివర్య! 180

ఏను మిము గెల్వ మీరు ముందేడ్చినట్లు
మ్రొక్కుదురుగాక మీ మీసములను దీసి
యట్లు తీయరుకాదె? పద్యమును మాత్ర
వాద మిది యందుసకె వచ్చెఁ గాదె? శాస్త్రి! 181

ఈవు నెప్పుడు మము గెల్చినా వటన్న
నెవరు గెలువనిచో మీస లేలతీతు
రూరకనె తీసి నారకో యుప్పకుండి
అయిన బెంచఁగ నేమిటి కట్లు మొదట? 182

ప్రతిఘటింపఁగ నింక నెవ్వారలేని
సిద్ధముగ నున్న నేమి చేసెద నటంటి
వెవరి మాటనో యిట్లు నీ వేలచెప్ప?
సిద్ధమై యిప్పు డీవు వచ్చితివి కాదె? 183

సిద్ధముగనున్న నేమి చేసెద నటంచు
చేసి తీవేమి శ్రీపాద! సిద్ధమగుచుఁ
గోర్టు కెక్కెదనని తెల్పుకొనుట యేన?
చేసెదే మందువే? యింక సిగ్గులేక. 184

మొదట మీరలు మీ మీసములను నొకటఁ
స్వారి జేయించినారు వైష్ణవుని మీఁదఁ
గవివరుల్ గెల్వుఁడను మాట నవల నవ్వి
యన్వయించెను గవికుల మ్మంతటికిని. 185

“ అతని నేమన్న నన్నని నట్లకాదె”
యనుచు మీ వైదికులను నేనరసికొందు
దీన నితరాంధ్రులెంత నా దిక్కెయంట
వచ్చెడిని వైదికులకు సుస్వాగతమ్ము. 186

“ వినుఁడు వైదికులందఱు వీనులొగ్గి
మీరు నా జాతినే మీఱినారలంట
యొప్పికొందును బొందు నే నొకఁడనోడి
రారె! నామీఁద వైదికులార! నేఁడు” 187

ఇట్లు భావార్ణవంబున నే వచింతు
నందు శ్రీపాద! దీని నీ వరయలేదె?
యేమి చేసెద వనుచు నింకేల యడుగ
నిదియ యధికప్రసంగ మీ వెఱఁగికొనుము. 188

వినవె? శ్రీపాద! పోతన యనిన మాటఁ
గాలఁదన్నినటంట లక్ష్మాంబ కడుపు;
దీనుఁడై నేను దన నింత తిట్టుకొనిన
నందునకు నేను నాహుతి యౌదుఁగాదె? 189

ఒకఁడ నేను మీర లోకక్షోటి రావచ్చు
శక్తి యేమొ నైఅపి చత్తుఁగాని
పిఱికిపంద ఇగుచు వెన్నిచ్చి యిస్నిరో!
జాతికైన మచ్చ సంఘటింతుఁ! 190

ఏ పొలాల్ వరిపోఁచ లీనుచు నున్నవో
పుడమియందలి నాదు పడకగాఁగ
నెవ్వారి బాహువు లెగయుచునున్నవో
నాయొడల్ కాఁటికి మోయుకొఱకు
ఏ వృక్షమున శాఖ లెదుగుచున్నున్నవో
క్షణమున నన్ను భస్మంబుఁ జేయ
నే స్థలంబీ భూమి నీక్షించుచున్నదో
తనలోన నాబూది దాఁచికొనఁగ

నెంద ఱిట్లుగ ననుఁబలె నేఁగినారొ!
వారిలో నేను నెన్నవవాఁడ నౌదొ!
యింక నెందఱు నా వెన్క నేఁగుదెంతొ!
యెందుకో యింత కీసృష్టి! యెంతవఱకొ! 191

అచ్చు వేసినవానిపై నమ్మువాని
పైనఁ దెచ్చెద నంటి డాఫాను భళిర!
చదువువారల మెచ్చి బోయెద వదేల!
గూల్చెదిని కోదె యదియు నీ కొంప మొదట. 192

నావలననైన నీ మాననష్టమునకు
జాలునని కోరెదవు పదివేలు మాత్ర
మింతకును మించికొను వేశ్య లిలను లేరె?
నవ్వరే వారు నీదు మానంబుఁ దలఁచి? 193

చెప్ప వినలేదె? నన్నా వీర చెర్ల పిళ్ళ
సమాజకవినంట డానికి సర్వ మేను
ధారపోసెదనఁట! యాబద్ధంబు కాదు
ప్రాణములనిత్తు నా యాంధ్రభాష కొఱకు. 194

మొదలిటి తరంగమును వ్రాయఁ బూనినపుడు
తలఁగె వసురాణి పదునాలుగు నెలల పిల్ల
రెండవ తరంగ మిటి వ్రాయుచుండ నప్పు
డరిగె నా ప్రాయమునకె వేంకన్న మంత్రి. 195

బ్రహ్మదేవుఁడు నా కవిత్వమున కోడి
దాని నడఁపఁగఁ జేయు నీ దారుణముల
నింతమాత్రము నేను జలింతు నేమి?
నిండమునిఁగినవానికి నుండు నె చలి? 196

వేదపఠనంబునను నవివేకి యగుచు
వ్రాసెనే బ్రహ్మ వారికి పాడువ్రాఁత
వారల ననామకులఁ జేయ వశమె తనకు?
బ్రహ్మ తానైన నేఁ గవిబ్రహ్మఁ గానె? 197

తనదు సృష్టిని వారుండ జనటియేని
నాదు సృష్టిని జీవింత్రు మోదమెసఁగఁ
దనదు సృష్టియె దుఃఖభాజనము కాని
నాదు సృష్టిని లేదు గా ఖేదమొకటి. 198

వేదములఁ జెప్పె బ్రహ్మ గర్వించునేమొ
పనికిరా నవ్వి నా కవిత్వంబు ముందు
తెలుఁగుభాషయె సకలభాషలను మేలు
కవులయందున మా మంత్రికవియె మేలు. 199

పుడమి నుత్తమ కవులతోఁ బోల్చినప్పు
డౌదలల వంపన లెనంట యాంధ్రకవులు
వైదికులు కాను కవులను వారలెల్లం
దలలు వంపము మే మహాత్ములను వినుఁడు. 200

ఈ తెలంగాణమున కవు లెవరటన్న
జెప్పుదును నాకు నేన నా చేయి నెత్తి
ఆంధ్రభాషకు నంతటికి కడుగు నపుడు
కాంత బెట్టెదఁ దిక్కన పోతనలను. 201

అవనిఁ గలయట్టి యే మహాకవులకైనఁ
బోల్చి చూడఁడు వెనుదీసిపోము మేము
మా నియోగి కవిత్వంబు మదిఁ దలంచి
వారలే మాకు సాష్టాంగ పడఁగవలయు. 202

ఇంక నీ గొప్ప యేమొ నా కెఱుఁగఁ జెప్ప
వంద యేఁబది గ్రంథముల్ వ్రాసితంటి
తన్నుచున్నాఁడ వాముపాదమున వానిఁ
దగులఁ బెట్టుటకైనను దగునె యవ్వి? 203

ఆరసిన యంత నీవ్రాయు భారతంబె
మూలఁబడి మూల్గెడిని గదా ముసుఁగుబెట్టి
యింకఁ దక్కిన తుక్కు నా కేమి జెప్పఁ
దలఁప నీ గ్రంథసంఖ్య కొవ్వలికి నెంత? 204

పిదప బిరుదులమూఁట విప్పితివి కనఁగ
నెందునకు వచ్చె శ్రీపాద! యీ యవస్థ?
యిఁతకును మించి కలవు మా యింటికుక్క-
కింక నీ బిరుదంబుల కేమి లెక్క? 205

బిరుదులను జెప్పి నను భయపెట్టఁ దలఁతె?
పేరుగలవాని కుండునే? బిరుదులన్ని
యున్న నిబ్బంగిఁ జెప్పనే యెన్నఁడైన
నీవొక యనామకుండవు కావె? శాస్త్రి! 206

ఇందునఁ బ్రభుత్వమొసఁగిన వెసఁగుననిన
నడిగెడను వాని నే భాషయం బొసంగ?
సంస్కృతముతోడి నా కే ప్రసక్తియుండ
దాంధ్రమున నన్న వానినే ననుమతింప. 207

దావ సేయుము నీ ప్రభుత్వంబు తోడ
మఱి వచించెద నామాట వెఱపులేక
నేను మంత్రిత్వమును మానినానె కాని
తెలుఁగునకు నప్పుడే తిలాంజలి నొసంగ. 208

దేశ స్వాతంత్ర్యమునకు గాంధీమహాత్ము
డెన్ని పడరాని యిడుముల నెదిరికొని యె
వట్ల నాభాష కెన్ని యిక్కట్లునైన
ననుభవించెద సంతోషముననను నేను. 209

అవసరంబైన నాఁడు నే నాజ్ఞనిడెద
యుద్ధమున కేఁగుదేర నియోగిజాతి
కూయలఁ బరుండి నిద్రించుచున్న శిశువు
ప్రాణమిడుగాక! జాతిగౌరవము నిలువ. 210

మంత్రి యొకహీనజాతిని మరిగె నేని
వాని కందున నే తలవంపు కలుగ
దే యమాత్యుఁడు కవితను వ్రాయ లేడొ
వాఁడు కులహీనుఁడొక మాలవాని కన్న. 211

చెప్పినను వినఁజెల్లని చిన్న విషయ
మిట్టి దానికి భ్రాన్తి ధాన్యమీయ నేల?
ఇంతకును దీర్చు కార్యంబు లేవి లేవా
కట్టెలోఁ బుల్ల యిరుకుట కా! విమర్శ? 212

కడుపుఁ జించుకొని నఁ గాళ్ళ నేవడుమాటఁ
దలఁచి మిన్నకుండ వలసెఁగాని
నిక్కముగను నేఁడు నియోగి కులమున్న?
నాకు లేక పోవుగాక కులము. 213

మంత్రులై యెనలేని మంత్రింబునం బంతు
లాడుకొన్నట్టి రాజ్యంబు లేవి?
సేనాధిపతులౌచు క్షితియెల్లఁ గంపింప
నడిపించి నట్టి సైన్యంబు లేవి?
వీరాధి వీరులై వైరి కోటి నడంచి
కత్తిని గడుగు రక్తంబ దేది?
కవి బ్రహ్మలై యింకఁ గవిసార్వభౌములై
వ్రాసిన యట్టి కావ్యంబు లేవి?

అంతయును స్వప్నవృత్తాంత మయ్యెఁ గాదె!
ఉన్న దెక్కడ నింక నియోగి కులము?
అంతయును నేఁడు స్వప్నవృత్తాంత మేన?
ఉర్వి నేడను లేద నియోగి కులము? 214

ఉన్న మన్నది కనుఁడు! నియ్యోగి కులము
కాచి యున్నాఁడ జూపించు కాలమునకు
జరుగనీ యుద్ధ మాంధ్రదేశంబు నందు
నేను రోమెలు నయ్యెద నిక్కువమున. 215

వచ్చెదను నేను నైజాము పక్షముండి
తర తరంబుల ఋణము సాంతముగఁ దీర్పఁ
జూడుఁ డొక్కండ నాంధ్రుల మూఁడుకోట్ల
నేమి గావింతునో యిప్పుడేమి చెప్ప? 216

మ్రొక్కుదును దేవునకు నేను మోడ్పు కేల
నంత వఱదాక నా కాయ మనని నిల్పఁ,
గోరెదను దక్కు నియ్యోగి కులజులెల్ల
వచ్చి నా సైన్యమునఁ జేరవలె నటంచు. 217

ఉబుకుచున్నది నా మేను యుద్ధ మనిన
నుదధిఁ బోలుచుఁ గనుఁడు! నియోగులార!
రక్తమిదె వచ్చి నా శరీరమున నిండుఁ
బట్టరాకుండ భావార్ణవంబు నుండి. 218

తేలిపోవలె దానితోఁ దేల్చ వలయు
నుంపు నది లేనిదియును నియ్యోగి జాతి
వసుధ నింతకు బ్రతికిన బ్రతుకె చాలు
మెచ్చినాఁ డెవ్వఁడీ మన చచ్చు బ్రతుకు? 219

తిట్టగ్రంథముగా దేనిఁ దెలిపినావొ
నీవు భారత మద్దాన రాదు వింటె?
ఏను గవిరాజు నంచు నీ వెంచెదేమొ
యేమి వ్రాతు కవిత్వంబు? నీ మొగంబు. 220

మంచి దిఁకనైన నీ వహంభావ ముడిగి
భళిర! యననుండు భావార్ణవంబు గనుట
తెలిసికొననేర్తు వద్దానఁ దెలుఁగు కవితఁ
తేనె గొలికించు నందలి తెనుఁగు దనము. 221

తెలుఁగునకు నేన కవినంచుఁ దెలుపు కొంటకు
మహిని నా పేరఁగొంటి నమాత్యపదము
వైదికుల మానముండిన వాఁడె యున్న
నేఁగు దెంచెడిఁగాక నన్నెదిరికొనఁగ! 222

తొలుత చెళపిళ్ళ యట్లు మీసలను బెంచి
చెప్పుచున్నాఁడు నేఁ డహో! సిగ్గు వీడి
తనదు కాలీనులైన కొందఱికె తప్ప
నెవ్వరికి నింక నవి యన్వయింప వనుచు. 223

అట్లు చెళపిళ్ళ కాలీను లనునయేని
మేటి ననవలె నేన యీ నాఁటి కవుల
భాషకుఁ గవీంద్రుననుటంచు వాగుడేమి?
నేఁడు నా రాక నీ మాట లాడుడేమి? 224

వైదికునకు లజ్జ లేదన్నమాటను
చెప్పుగాక యట్లు చెళ్ళపిళ్ళ
మానవంతుఁడో యమాత్యుఁ డబ్బంగిని
బలుకఁగలఁడె? పలికి బ్రతుకఁ గలఁడె? 225

నాదు కాలీను లనుమాట కాదు కాదు
ఏను జచ్చియుఁ బ్రతికింతు నెల్లకాల
మెవఁడురా! మా యమాత్యుల నీసడించి
కలము నడిపెడి మొనగాఁడు తెలుఁగు నేల? 226

నా సవాలన్వయించును నన్నయఁగొని
కుతలమునఁ బుట్టు తుది వైదికునకు నిజము
మింట సూర్యుఁడు వెలుఁగొందు మేరకైన
నొసఁగెదరుగాక! నాకుఁ బ్రత్యుత్తరంబు, 227

ఏను జచ్చితినని వీర లెంచవలదు
నాదు నామంబునకు మరణంబు లేదు
దానికెంతేనియును మహాత్మ్యంబు కలదు
'కో' యనఁగ నుద్భవింతురు కోటి కవులు. 228

ఏ ననుదునంట తాను నన్నెదిరికొంటె
ఈవు మా బావఁ గొట్టెద వే? యటంచు
దీనఁ జెళపిళ్ళ బావకుఁ దీయుఁగాదె?
ఏ మొగంబుండి యింక నన్నెదిరికొనును? 229

తనకు నాయట్ల బావకుఁ దాను నెవఁ
గలదె! చెళ్లపిళ్ల కిఁకను ఘనత యొకటి?
ఆ పరాభవ మొప్పదా? యాత్మహత్య
కింకఁ దగుదని యీ కారులేల పోల? 230

ఏను జెళ్లపిళ్ళ మున్ను కన్నుజేయ
నేమి చెప్పెను బావ? తా నెఱుఁగఁడేమి!
అద్ది పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మనఁడె?
అంతియే కాదె! తనను నే నరసికొనుట. 231

ఇంత నేనేల? తాను నన్నెదిరికొంటె
కలఁడు నా కన్నుసన్నల మెలఁగు బావ
వలదటన్నను దనమీఁద వచ్చిపడును
నింకఁ జెళ్లపిళ్లవారికి నేమి దిక్కు? 232

బావ తనను దన్ని పడవైచు మీఁదటఁ
ద్రెంపలేనె? తనదు దుంప నేను
జూడఁ జెంపదెబ్బ గోడ దెబ్బయు రెండు
దాకి వచ్చుఁ గాదె? తనకు నపుడు. 233

వైదికాళికి నామీఁదఁ బగయె యున్న
గావ మున్నెందు నోడింపవలయు వార
లెంతవట్టు కది కానిదో యంతవఱకు
నీఁగ వ్రాలదు నామీఁద నింత నిజము. 234

ఇంకఁ గాలీనులకె యన్వయించుననుట
కనుచు నున్నారు కాలీనులైన వార
లొక్కఁ తన్నున మీసము లూడుననుచుఁ
జెప్పికొను నేమి? దీనికి జెళ్ళపిళ్ళ. 235

ఎందుకనుఁ గాక మీసంబు లింత పెంచి
దండిమగలున్న మమ్ము గెల్వుండటన్న
నెదు గెల్వంగవలెఁ? వీరి నిల్లగాక!
నీవ చెప్పుము శ్రీపాద! నిజమెకాదె? 236

నేఁటి కవులందునను తాను మేటియైన
నందఱను మించి కవిత వ్రాయంగవలయు
మీసముల బెంచు నీ వెట్టి వేసమేమి?
రొయ్యకే మీస లెంతటివయ్య? శాస్త్రి! 237

వాదమునఁ జెప్పితినిగాక బావమాట
వీఁడు నిలఁబడునే నా కవిత్వ మెదుట?
నెంచినాఁడేమి? చెళపిళ్ళ యేననంగఁ
బట్టభద్రుఁడఁగదె కవిత్వమున కేను! 238

"ఒక్క చెళపిళ్ళ, వారి శిష్యులునె గాక
ఆంధ్రకవు లందఱజ్ఞారె! యనక తప్ప
దీ కవిత్వ సౌందర్యంబు నెంచునప్పు"
డనఁడె? యభినవ తిక్కన యంతవాఁడు! 239

విభాగ సంఖ్య.

ఇట్లు నాకీర్తి జగమునం దెసక మెసఁగ
నింక ననుఁగూర్చి నాకు నే నేల జెప్ప!
నెవఁడు లేడు కవీంద్రుఁడ నే నెయనుచుఁ
జెప్పికొనుఁగాక! చెళపిళ్ళ సిగ్గులేక. 240

నీం పోరుదె? ఘంటి పండితుల తోడఁ
బామరుఁడఁ గాను నేనును బండితుఁడనె
పండితులతోడ నింతకుఁ బనియెలేదు
కవిత నడిగెద నాకీడ కవులు వలయు. 241

బాపురే! యింక నా దేహబలము నడుగు
దెందువకొ? దేహబలము నా కెఱుఁగరాదు
కవిత నాతోడ వ్రాయుట కాదు కాన
దేహబలమున గెలువంగ నూహఁ గొనుదె? 242

తిండిలో నీవు సుప్రసిద్ధుండవగుటఁ
గలిగియుందువు నేఁటికిఁ గండపుష్టిఁ
జూడ నెంతేనియును బక్కవాఁడ నేను
దేహబల మింతయును లేదు తెలిసికొంటె! 243

అయిన నా దేహబలము నీ వడుగు నపుడు
తగనికార్యముకద నాకుఁ దప్పుకొనుట
చచ్చుపందెము మాత్రంబు మెచ్చ నేను
వినవె శ్రీపాద! యింక నాయనెడుమాట. 244

ఇంత కీ వేమిగా నెంచి తేనసంగఁ?
బిల్ల వాఁడీతఁ డితఁడేమి పీకుననియ?
కలదు నిఖిలాంధ్రజాతి నా గౌరవంబు
ప్రళయ మాంధ్రావనికి నా పరాభవంబు. 250

కౌరవేయులు కృష్ణు నొక్కనిగ నెంచి
కట్టుటకుఁ దెచ్చిరంట పగ్గములఁ దొల్లి
ఈడ నన్నొక్కనిగ మీర లెంతు రేనిఁ
జూపెదనుగాక! నా మంత్రి రూప మేను. 251

తిక్కనామాత్యుండు తిక్కఁ దిమ్మిరిఁ బాపు
నాచనసోముండు పీచమడఁచు
శంభుదాసుఁడు కిన్క శారదనేమ్రింగుఁ
బోతన్న తాత ముత్తాత నడుగు
శ్రీనాథుఁ డెదురేగి చెంపలు వాయించు
ముక్కు తిమ్మన లేచి మోముఁదన్ను
గండపెండేరంబు గర్జించి తొడఁగొట్టుఁ
బింగళి యూఁకొన్న సింగమగును

ఇట్టి వస్తాదు లింకెంద ఱిందఱుండ
వైదికుల కింక నా తలవంతు నెట్లు?
ఎవఁడురా మాయమాత్యుల నీసడించి
కలము నడిపెడి మొనగాఁడు తెలుఁగునేల! 252

ఇట్లు వెల వెల బోయెద వేటికోయి!
ఏ నెవండనో యిప్పుడైన నెఱిఁగికొంటె?
అందువే నన్ను నొకని రమ్మనుచు భళిర!
చెప్పకీమాట శ్రీపాద! సిగ్గుసిగ్గు. 253

ఆలమున వచ్చు వారెవ్వరైన నేమి?
మార్కొనఁగ నొప్పుగాక సామర్థ్యమున్న
వారు వలవదు నీవె రా వలయు ననుఢె?
బాపురే! యింతయున్నె నీ పౌరుషంబు? 254

వైదికుండు పప్పు బ్రాహ్మణుండను మాటఁ
బందవగుచు నిటు బలుకుదైన
నాకు నిన్నుఁబోలె వాకొనవచ్చునే!
యొక నియోగినవుచు నుద్భవించి. 255

వార లిద్దఱె కాని కొపరింపు కవులు
వైరి కోటిని మార్కొనినారు కాదె?
గెలువనీ! యోడనీ! దానిఁ దలపఁ నేమి?
యేమి నీతుచ్ఛ జీవితం బేద్వమోయి! 256

ఎల్ల జీవకోటి కేనాఁడో యొకనాఁడు
మరణ ముండు మాట మఱచినావె!
బ్రతుకు నాల్గునాళ్ళ భళిరా! యటంచన
బ్రతుక కేటి కింత పాడుబ్రతుకు? 257

నలయు నెడ నన్నయనునైన బిలువరాదె?
కొంత మీ కష్టమును బంచుకొనునోయేమొ!
యతఁ డమాత్యుల మీఁఅలేడనివచింతె?
యెందుబోయెదవింక నీ కెవఁడుదిక్కు? 258

ఏ మహాకవికింక నీ సృష్టికాదన
బ్రహ్మ పేరున భూమిఁ బరగునాఁడు
సంస్కృతాంధ్రమ్ముల జగమెల్ల మెప్పింప
భయద ప్రతిజ్ఞను బట్టునాఁడు
కవులన్న వారున్నఁ గనరారె! నాకంచుఁ
గంచు ఢక్కలఁ బగిలించునాఁడు
దిగ్గజంబుల గుండె దిగ్గురు మనుచుండ
గండ పెండేరంబుఁ గాంచునాఁడు

చచ్చి పోయెనో వైదిక జాతి రొ[illegible]కట
గంటెఁ ద్రిప్పుచు నున్నదో వంటయింటఁ
దీర కుండెనో తిండి పందెముల గోడన
వచ్చితే నన్ను గెల్వ శ్రీపాద! నేఁడు. 259

ఇందునకు నన్ను నిట్లాడుదే యటంటి
విట్లు రాయలనాఁడు వచింతు నేను
మానధనుఁడౌట గజపతి మఱలిపోయె
నిదియె భేదంబు శాస్త్రి! మీ యిరువురకును, 260

ఇంతకొఁక నన్ను గెలిచి మీరేమిసేతు
రంత తోడనె విజయంబు నందినారె?
సమ్మతించునె లోకంబు? శాస్త్రివర్య!
మీకు 'నేనోడ నోడరే మాకుమీరు? 261

మాకు మీరలోడు మాట నిజంబైన
నేను మీకుఁ దీసిపోను వినుము!
మంత్రులనిన మీకు మఱి దిక్కు లేదైన
వైదికులకు నేను భయముఁగొనుదె? 262

ఇంత కరయంగ నొక్కఁడ నేనెకాని
యీవు నాతోడ గీతంబు లెన్ని వ్రాతు?
కనఁగఁ జేతువె నీవు నా తెనుఁగుఁదనము?
నాదు జీవంబు కలుగునే నీదుకవిత? 263

అరయవే యేకవీరఁ బద్యముల వ్రాయ
నేను జేయు ప్రతిజ్ఞ నీ వింతవఱకు?
నందునకు విశ్వనాథ భయంబుఁగొన్న
రావదేటికి నీవైనఁ బ్రతిఘటింప 264

ఎట్టిఁడో విశ్వనాథ నీ వెఱిఁగి కొంటె!
వ్రాయునఁట రోజునకును గావ్యంబు నొకటి
యానఁగొని నేను సంవత్సరార్థమయ్యె
నోడలెఱుంగఁడో! చచ్చెనో! వడకుబుట్టె 265

మఱియు గవులం దతండు సమా ్రిట్టటంట
ఈవు కవిరాజు వయ్యెద వెంచిచూడ
నతఁడె నీకన్న గొప్పవాఁడవునటంట
ఈవు నాశక్తి నిపుడైన నెఱిఁగికొంటె? 266

తెలుఁగులోన శక్తి కలుగు నద్దానిచే
గెలుతు ననుచు నీవు తలఁతె యంటి
తెలుఁగు నందు నీవు తీసిపోయెదు కదా?
యింక నాదుశక్తి కేమి వలయు? 267

పోయినావు చతుర్విధములక దేల?
గెలువు మీ యొక్క విధమునఁ దొలుత నన్నుఁ
దక్క విధముల నామీఁదఁ దలఁపవచ్చు
నిందు శ్రీపాద! చెప్పు మీ వేమ నందు? 268

తెలుపనేల చతుర్విధ ములను నాకు
వాని తలఁదన్ను దొక్క విధాన నేను
అనఁగ నా తలఁదన్నెద ననిరొ నంటి
విలను శ్రీపాద! యొందైన నింత యున్నె? 269

నీకు నామీఁదఁ గోపంబు నెగడు నేని
వాదమున వచ్చి దీర్చికో వలయుఁగాని
లేని పోనివి యిట్లు గల్పింప నౌనె?
యరయ కుందురె! బుధులు నా యనిన మాట. 270

ఈ చతుర్విధములు చెప్పు మెచటివి వౌను?
తండ్రి సృష్టించెనో లేక తాతగారో
వానికిని మూల పురుషుండ నేన కాదె?
చెప్పుటకు నీకు శ్రీపాద! సిగ్గు లేదె? 271

నాకుఁ బాండిత్య మింతయు లేక యున్న
దానితలఁదన్నెడిని కవిత్వంబు కలదు
పోను నేనిందు బ్రహ్మ దేవునకుఁ గూడ
సత్యము వచింతు నిది సహజంబు వినుము? 272

ముందు తిక్కన పేరఁ బుట్టి లోకంబునఁ
గందంబునకుఁ గీర్తి గాంచినాఁడ
నటుమీఁదఁ బోతన్న యను నామమ్మున వచ్చి
వృత్తంబులకు భిక్షఁ బెట్టినాఁడ
నానాఁడె మఱిఁ జెప్ప శ్రీనాథుఁ డననుండి
సీసమ్ము నా సొమ్ము జేసినాఁడఁ
నింక నేఁటికి రామకృష్ణ మంత్రి యనంగ
గీతంబునకుఁ గీటు గీసినాఁడఁ.

బ్రతిభయన నిట్టిదె యుండవలెను గాక
ఎన్ని గ్రంథంబు లెంతగ నేల వ్రాయ?
వేయు నేటికి? తెలుఁగు కవిత్వ మనిన
నే నొకండనె కుత్త కొన్నాను జగతి! 273

ఇంత వాఁడను మీకు నేనేటి కోయి
చాలు మిము గెల్వ శూద్రులు స్త్రీలు గలరు
చెప్ప లేదేమి యీ మాట చేమకూర
ముసుఁగు దీయదె? యల్లన మొల్లనామ. 274

ఆమె నప్పుడు నన్నయ యేమిజేసె?
నేను మొల్లకు నడ్డంబు నిలువ లేదె?
భంగపడిపోడె నన్నయ వాదమందు?
ఇంక మీ బోంట్ల నడిగిన దెవ్వఁడయ్య! 275

తప్పులున్నను భాష నా చెప్పు వదియు
అట్లు నాదే కవిత్వ మంచనుదె యంటి
వయిన నీ కైత నిర్దుష్ట మవునె? చెపుమ!
తప్పు లెవ్వారి యందున నొప్పకుండు? 276

నాదియు కవిత్వ మీ భాష నాదె యనఁగ
నెప్పుడో యింతకును మున్నె చెప్పినాఁడ
నయిన భావార్ణవంబు నీవరయ కునికి
వినవె? యామాట మఱలఁ జెప్పెదను నేను. 277

" పట్టఁబోకుఁడు నా కవిత్వమునఁ దప్పు
నా ప్రయోగంబె వ్యాకరణంబు వలచుఁ
దప్పులేమైనఁ గొనుఁడు సూత్రింబు లట్లె
యిద్ది నాయాజ్ఞ యెవఁడు నోరెత్తువాఁడు" 278

అప్పు డట్లు వచించితి నంతియేన?
ఇప్పుడేమనుచుంటినో యింకఁ వినుము!
నడచు వ్యాకరణంబు నా యడుగు లంటి
చెప్ప మీ వైదికుల కేన జీవకఱ్ఱ. 279

అందునకె కాదె! శ్రీపాద యఃకని జనులు
మనకుఁ గల భేద మీరీతి వినిచినారు
భాష కారయ నీవు సేవకుఁడ వంట
యేను బరిపాలకుఁడ నంట యిది నిజమ్మె. 280

అయిన రాజనకన్న నౌదువు బలవంతుఁ
డనుచు మఱియు నేమొ యనఁగ వచ్చె
తౌను రాజు కన్న నయ్యోద బలవంతుఁ
డెఱుఁగ వేమి దీని నింతవఱకు? 281

నన్నుఁగని రాజలోక మంజలి ఘటించు
రాజ్యములు నాకొసంగు నీరాజనంబు
రాజులను దీర్తు నేను రారాజు లనఁగ
రాజ్యముల మార్తు నేను సామ్రాజ్యములుగ. 282

సాగిలెను నాకు గణపతి చక్రవర్తి
కృష్ణరాయుల కే నేన యేందుగడయ
నన్ను మించిన మంత్రి యున్నాఁ డెవండు?
మహిని నా కీర్తి మోయు నే మానవుండు! 283

తలఁచు నెద్దనొక్క బాల్య చాపలమె తప్ప
నిచటఁ గానంగ రాదంటి వితర మేమి?
ఉహుహు! నీమతి చెడిపోవు టొకటి తప్ప
నాకు నిరతంబు నేమి గానంగ రాదు. 284

ఎన్ని సారులు జెప్పిన నింక నేను
మా యమాత్యు లటంచని వ్రాయుదంటి
వీవ వచియింపు మందు దప్పేమి కలదు?
వారమాత్యులు కారె? మావారు కారె? 285

అట్టి మృతజీవులను లెక్క పెట్టకేను
నిన్ను జీవచ్ఛవంబును నెన్ను టెట్లు?
ఎన్నవలెనని నీకిష్ట మున్న దైన
నందునకుఁ జెప్పవే యొప్పికొందు రెవరు? 286

ఒకట నట్లనె యింక మాటికిని నేను
భారతము భాగవతమని పలుకు దంటి
వాంధ్రమున నంతకును మించి యరయరావు
నేఁడును నచించుచున్నాడ నిక్కవంబు. 287

ఆ మహా గ్రంథములను గాదనుచు నేను
తఁచెదను నీదు చచ్చు గ్రంథముల నెట్లు?
తలఁచితే పొమ్ము నేను నీ తలఁ బెఱింగి
హిహిహి! యని నవ్వరే యెవ్వరేని విన్న? 288

ఇందునను నిన్ను గొప్పగా నెంచికొనుచు
ననుదె నా పాటివాఁడు లేడనుచు నంటి
వట్లు నాపాటివాఁడు లేడనుట కాదు
వారిసరివాఁడె లేడనువాఁడ వింటె! „ 289

ఎవరు లేరు కవీంద్రుల మేమె యనుచు
మీసముల బెంచి యీ మాట మీారలందు
రేను మాబోంట్ల ముందు మిమ్మెంత యనెద
నొసఁగవే చాలు దేని ప్రత్యుత్తరంబు? 290

అడిగితివి యింక నీవె వారా? యటంచు
నింతవఱదాక నీ వెట్ల యెంచినాఁడ
వెఱిఁగికొను మోయి! చెప్పెద నేనెవారు
వారలే నేను గాదను వాఁడెనండు? 291

వెనుక రామాయణంబంత విని యొకండు
అడిగెనఁట సీత రాము కేమగు నటంచు
నట్ల నేకాదె నావాద మంత వినియు
నరయ నట్లుగ నీవు నన్నడుగు మాట! 292

వారు వ్రాసిన వానిఁ జూపంగఁ దెచ్చి
యేను గెల్చితినని యెంచితే? యటంటి
వేకవీరను వ్రాయుట కేమి చెప్పి?
తింక నీమాట నడుగఁగ నేమి ఫలము? 293

ఇంతకు వచ్చినపు మీ వాద మేలవచ్చె?
వారలను మాయమాత్యులఁబట్టి కాదె?
యేను వారల గ్రంథాలె యేలజూప?
నీవు తేవచ్చుఁగాదె వానికిని మించి? 294

వానికిని మించి మీవారు వ్రాయరేని
నీవు నీ యభాగ్యమునకు నేడ్వుమోయి!
నిన్నుఁ బలె నేను మావారి నెన్న నేల?
నేను గలవాఁడ నావారిలోన గలరు. 295

ఈవు నీయభాగ్యమునకు నేడ్వుమన్న
వచ్చినది నీకుఁ గోపంబు పట్టరాక
నీ యభాగ్యంబునకుఁ జెప్ప నీవెగాక
యేడ్వుమందువె నన్ను నాకేమివచ్చె? 296

పిల్లకాకిగ నేను వర్తిల్లు దనియుఁ
దలఁప నిది నాకొకింతయుఁ దగదటంటి
ముండ యందఱుఁ దనవలెనుండ మ్రొక్క-
డగుపడంజేతువిదినీకుఁ దగదు వింటె! 297

ఇందునకు నీవు వలవల యేడ్చినాడ
వింత బేలవు నామీఁది కేలవచ్చి
తనక తప్పునె నన్ను నీవనిన మీఁద?
నీకె చ్చును మాటలు నాకు రావె! 298

పోదు వీవింకఁ గలియు మీా వైదికులను
నను నియోగుల నూడి రమ్మనెదు బయట
చెప్పవలయును నీధర్మ చింతనంబు
నిది వితండమ? వాదమా? యేమనందు? 299

ఏనె నాజాతిఁ బాసిపోయితిన యేని
నుందునేఁ డెవ్వఁ డింక నియోగి యనఁగ
నంత నాజాతి కేమి చిహ్నముగఁ జెప్పు?
నీ విపన్నాంధ్ర లోకాని కెవఁడు దిక్కు? 300

ఆంధ్ర దేశంబునకు మఱి యాంధ్రభాష
కేను బెట్టని కోటగ నెసఁగుచుందు
నేమి కలదయ్య! యాంధ్రుల కేను లేక
వారి మీాసంబు నేను శ్రీపాద! వింటె? 301

ఎనుబదేండ్ల ముసలివే యయ్యు నీవు నా
“కవ్వరావె మఱియు బువ్వరావె”
యనెడు నట్టి యొక్క యజ్ఞానునిగఁ దోఁతు
వింకనైన నన్ను నెఱిఁగి కొనుము, 302

అనఁగ నాకు విధేయుఁడవై మెలంగఁ
జెప్పుచున్నాఁడ దీనికీ వొప్పుకొనుము
ఏను గవిరాజు నంచు నోరెత్తుదేని
నార్తిపడెదవు! కవిచక్రవర్తి నేను. 303

వినయమొప్పఁగ నిను గౌరవించినప్పు
డేను నీ కింతయేను గానరాను గాదె?
కనులబాసెనె? గర్వాంధకార మిప్పు
డనుభవించితె? యందున కైన ఫలము. 304

పూర్వమెవ్వఁడో గాలికిఁ బోవు కంపఁ
దనదు కాళ్ళకుఁ దగిలించుకొనె నటంట
అట్లనేకాదె? నీ కథ నరసికొంటె
ఎందునకు వచ్చి తేను నిన్నేమనంటి. 305

ఈవు కవిరాజు వయిన నయ్యెదవుగాక!
దానితో నాకుఁగల నిమిత్తంబదేమి
వచ్చినట్లెల్ల దిట్టినఁ బడునెవండు?
ముసలివాఁడవు నేను జెప్పుదునె? బుద్ధి. 306

చెళ్ళపిళవారిఁ జెఱఁగిపోసితి నటన్నఁ
దలను దాల్చెద నతని పాదముల నేను
గరువముగఁ జెప్పు దతఁడె నా గురువటంచు
జెప్పు నన్నట్లె యతఁడు నా శిష్యుఁడనుచు. 307

చెళ్ళపిళ్ళకుఁ దెలియు నా చేవయేమొ
నే నెఱుంగుదుఁ జెళపిళ్ళలోని శక్తి
వీరుఁడగువాఁడు వీరుని బేరుకొనును
నాఁడొరులలోనఁ బగలు రేకొత్తెనేని. 308

ఏదో ధోరణిలోన నిన్నింత బాగిడి
తంతకే సేయనోనె? యీ యోగడంబు
నిక్కము వచింప నీవెందు లెక్కయాదు!
గతికయును గావు కాదె నా గురుని ముందు. 309

నన్ను జెళ్ళపిళ్ళ మన్నించినాడన్న
నతఁడు భీష్ముఁ డేను నర్జునుండ
శిష్యుఁడౌట నాకుఁ జెల్లివచ్చెనుగాక!
అతనిఁ జెనక నెవని కలవియగును? 310

అలుకగొని యాతఁడే చేతఁ గలముపట్ట
బ్రహ్మ రుద్రాదులైన నిల్వంగలారె?
కొంత కీరితి నా కీయఁ గోరెకాదె?
గురుఁడు నామీఁదఁ దన దయ గురిసినాడు. 311



# ఇది కలము దెబ్బ

ఇంక నొక్కనిగూర్చి వచించువాఁడ
కంటె మునుమూరు భాస్కరుఁడంట వాఁడు
వ్రాయుచున్నాఁడు నా శత్త్రంబు నొకటి
ఆలకింపుము దాని నో యాంధ్రజాతి, 1

"ఆశుకవులైన కొప్పర పాశుకవుల
జోలె దగిలించుకొని రాజ్య మేలుదనిన
పట్టెడన్నము పెట్టె దావలకు జనుము
కుక్కవై మొఱుగు దేని నీ కక్కడంతు" 2

'ఆశుకవు'లని రెండు మార్లనుట రోఁత
జోలెఁ దగిలించుకొని రాజ్య మేలఁడెవఁడు
'పెట్టెదావల' కీ సంధి కొట్టువడును
నాలుగవపాదమందు గణంబు లేదు. 3

ఇట్టు లొకపద్యమందున నిన్ని తప్పు
లనును నీ పసఁజూతు రమ్మనుచు సభకు
మాటలేమొకొ! కోటల దాటిపోవుఁ .
గడపయును దాఁటనేరవుగాదె కాళ్లు? 4

పెట్టునఁట! దాను నాకింకఁ బట్టెఁడన్న
మెవ్వనిం జేసి రాణింతు కీ తెలుంగు
లట్టివానికి నొక పట్టెఁడన్నమంట!
చెప్పుటకునైన వీనికి సిగ్గులేదు. 5

రాజులకు రాజ్యములఁగూర్చి బ్రతుకుజూపు
నీ మహామంత్రి కే యయ్య యేమి పెట్టు?
తన్నె యనేకులు జత్తు రాకలి యటంచు
వారలకుఁ బెట్టరాదె యీ భాగ్యశాలి? ౬

అడుగువారికి లేదు పొమ్మనెడివాఁడు
పెట్టునఁట! యింక నాకేమొ పెన్నితోడ
యింట వేలాడు నుట్టికె యెగురజాల
డందుకొను నెట్లు? చెప్పుడా! యాకసంబు 7

ఉర్విఁ దానొక భాస్కరాఖ్యుండు నగుట
దాన భాస్కరుఁడే నని తలఁచెనేమొ!
వాఁడు మంత్రీంద్రుఁ డెవ్వఁడీ వాడుకట్టె?
పేరునకు లేదొకో! నేతిబీరకాయ. 8

వ్రాయుచున్నాఁడు మఱియు నావలకు జనఁగ
నిందు గడువను మాత్ర వచింపలేదు
వీఁడు నామీఁద దయఁ జూపినాఁడు కాదె?
యిచ్చ వచ్చినప్పుడు పోవుదనుగాక! 9

ఇంక గెంటెదనని వచ్చునేమొ! యీత
డిట్లె శివరామశాస్త్రియు నేఁగుదెంచె
నాతనికి నైన 'శాస్త్రి' పేఁ డరసికొంటె
యనఁడుగద! నన్ను నవల బొమ్మనుచు బేల. 10

ఈ నియోగియె యావల కేఁగెనేని
యాంధ్రభారతి కెవఁ డభయంబొసంగు
నే కులంబున నుంద్రు మహా కవీంద్రు
లెవరి వచియించి మురిసి పోయెదరు జనులు? 11

అరయ వీడింక నాకక్క సణఁచునంట
భువిని నేనొక కుక్కనై మొఱుఁగుదేని
కుక్క మొఱుఁగును మీఁద వాక్రుత్తుగాని
కక్కడంచుట కర్థమ్మె కలుఁగునేమి? 12

తెలుఁగు కవితను మా యమాత్యులను మించి
వ్రాసె నెవఁడను నుడికి జవాబులేదు
చూడవీఁడేమొ గఱుగుఱ్ఱులాడు నురక
కుక్క మొఱుఁగింకఁ జెప్పెడే యుక్కివునిది? 13

అనియెఁ బండిత పుత్రుడటంచు మఱియు
నెవని పుత్రుఁడో తాను నేనెఱుఁగ వలఁతు
బశువునకుఁ జనియించిన వాని కన్నఁ
బూజ్యుడేకాడె పండిత పుత్రుఁ డిలను? 14

అరయ నభినవ తిక్కన యంత వాఁడు
నా కవిత్వంబునకు నమోవాకములిడె
నెవఁడురా వీఁడు నన్నెంచి యెగ్గులాడు
నెంచితే వీఁడు నాకైత కెంతవాఁడు? 15

వీఁడు పోతన పరువు గాపాడ లేని
పరమ నిర్భాగ్యుఁడనియు దుర్భాషలాడె
నేను దానిని గాపాడ లేని యెడల
భాగ్యవంతుఁడు తాను గాపాడ రాదె? 16

అందునకు దాను సంసిద్ధుఁడైన యెడలఁ
జెప్పు దెబ్బల గతినాపుఁ దప్పునుగద!
అడుగుచున్నాఁడఁ జెప్పుమో యాంధ్రజాతి
ఇంతకును మించి యింక నేనేమి పడుదు? 17

రెండు భాషల కేమె యుద్దండులమని
మీసములఁ బెంచి వైదికుల్ రోసమడిగి
యందునకు నేను మంత్రిల ముందు బెట్టి
యడుగు దీ కైత కెది సాటియౌనటంచు. 18

ఇందునకు నొక్కరుండైన నియ్యకొనుచు
నోసఁగ జాలఁడు తగిన ప్రత్యుత్తరంబు
నింక నీ చెప్పుదెబ్బల నేలఁ గొట్టె?
లేదు కాఁబోలు! చెప్పు నా పాదమునకు. 19

తనను నొక బ్రాహ్మణోడు కనుగొనిన యెడల
వ్రాయవచ్చునె మా కవిత్వంబు మించి
తనకు నయ్యది మొనగానితనము కాదొ?
ఇట్లు తిట్టునె! కన్నుమిన్నెఱుంగకుండ. 20

ఏ మహాత్ముల మొకని నన్నా మఁటన్న
వాదమున భంగపుచ్చి యా మీఁద నంటి
మిట్టి యనదతనంబు మేమేడఁ జూడ
మితనిఁ గను తల్లి గొడ్డురా లేలకాదు? 21

ఏను జెళపిళ్ళ శ్రీపాద నేమియనినఁ
జెప్పుదెబ్బల మాత్రంబు చెప్పలేను
వారు నన్నన్ని యనిన నిప్పగిది ననరు
హీనజాతి సుభాషిత మింతయున్నె? 22

వినరె! ఇంకను నీ బ్రతుకునకుఁ దోడు
కవితయా! యంచు నన్నెంచి కాఱులాడె
నీ యమాత్యునకే తైత యేటికనినఁ
దగిన దెవ్వని కది వ్రాయఁదగు నెవండు! 23

ఏను గాకుండ దానికిఁ దానె తగినఁ
దెలియఁగోరెద నీతని కులమదేమి?
ఎందఱు కవీంద్రు లందు జనించినార?
లే మహాగ్రంథముల వ్రాసి రా మగండ్రు? 24

వీఁడు నా బ్రతుకును లెక్కఁబెట్టునేని
వసుధ నను మించి బ్రతికినవాఁడెవండు?
నేను నా బ్రతుకును జెప్పఁ బూనితేని
బ్రతుకునే? యింక వీఁడు జీవముల విడక. 25

కంటె భాషాసరస్వతి నంట! యిహిహి!
నేనఁటంట! బలాత్కరించితి నఁటఁట
తననుబోలెనె నన్నుకొనినవాఁడు
కామిలారోగి పచ్చగ గనఁడె? జగతి. 26

ఎంచితే చెళ్ళపిళ్ళ కవీంద్రుఁడేను
సహజకవి యీతఁడని నన్ను సన్నుతించె
ఔమ్మువిఱిచి నచింతు విశ్వమ్మునందు
కవికులమ్మున మాదె నిక్కమ్మునందు. 27

చూడుఁ డేను బలాత్కరించుటలు కాదు
సనదు నను వీడి కాలఁదన్నినను నదియు
యింటఁ బడియున్నదని బెట్టు దింత యున్న
మరయు నిదియును నాదోస మగును గాదె? 28

తన్ను దనుటను జూడుఁ డజ్ఞాని నిదిగో!
కంటనీర్వెట్టు నను బిగ్గఁ గౌఁగిలించి
ఈయ ద్వేష్టాటె సంబంధమో యెఱుంగ
దాని కన్నీరుఁ జూడంగ లేను నేను. 29

కాటుక కంటినీరులఁ
గాలువగట్టఁగ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని
గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను
నావలఁ బొమ్మని కాలఁదన్న నె
ప్పాటనునైనఁ గోపమునఁ
బల్కితి దీనికి శోకమేటికిన్? 30

తిట్టు, పీఁకుంతటనుబోక తెలుఁగునందు
నిట్టిబోంట్లకను సజీవులే యటంచు
మా నియోగికులంబిల మనుటఁగాదె?
చేయు నీ యాంధ్రభారతి జీవయాత్ర. 31

ఏము లేకున్న భారతి కేమి తెలివు?
మాడిపోవదె? మలమలఁ గూడులేక
మోహనంబైన యీ దేవి దేహమునకు
జీవములు మా కలంబులే కావెచూడ. 32

త్రిపురనేని జీవించెడి దినము వఱకు
నీవు జీవచ్ఛవమవైతి వేటికొ? కనియె
నేను వచ్చెడివార్తఁ దా నెఱిఁగియేన
దేహమునువీడి దివికేఁగెఁ ద్రిపురనేని? 33

నాఁడు చచ్చిపోయి నేఁడు జన్మించితే?
యనియు వీఁడు నన్ను ననఁగవచ్చె
నేను నాఁడు బుట్టనే లేనఁటన్నచో
నింకఁ జచ్చిపోయి టెట్లు? చెప్పుఁడ! 34

మాయురే! ఇంక వీఁడు నీ ప్రియమిప్పు
డయితె. రెండేడులేన యటంచు నడిగె?
నిటు వచియించుటకు సర్థమేమి కలదు?
వాఁడు నాతోడఁజెప్పి చావండు గాదె? 35

అట్లు కాలంబు రా నాతఁ డరుగునేని
నేను దానికి బాధ్యుండ నెట్లు? చెప్పుఁడ!
జ్ఞానదృష్టి నెఱుంగుదో వాని చావు?
బ్రతుకునాఁడింక నేనెట్లు రాకపోతి? 36

చెళ్ళపిళ వారలను విమర్శించి తనిన
నచ్చు వేయింతు ముసలివాఁడనుచు వేగ
మొద్దువలె నుండు వీనికి మూఁడెనేమి?
బ్రతుకఁ గూడదా? కొన్నాళ్ళు వఱకు నింక. 37

వాఁడు చావక బ్రతికి యున్నాఁడె యనుఁడు.
అడుగుచున్నాడ వానినేనరసి కొనుచు
నెవఁడురా! మాయమాత్యుల నీసడించి
కలము నడిపెడి మొనగాఁడు తెలుఁగునేల? 38

ఏమురా! మీయమాత్యుల నీసడించి
కలము నడుపుదునని తన్నుఁ దెలిపికొనునా!
వాని నడిగెద నీ కవిత్వమ్మొ దెమ్మొ
బోలు దీనెందు తిక్కన పోతనలకు! 39

తెలుపుకొను నేమి దీనికిఁ ద్రిపుర నేని!
బ్రతికి యుండిన వీఁడైనఁ బలుకు నేమి?
భాషయందు నియోగితో వాదమనిన
నుండియును లేక నెవరైన నొకటికాదె? 40

వచ్చిన కవిత్వ మదియేమొ వ్రాసికొనుచు
నంతకుందగు బొంతలపొంతఁబోక
అనునె! యాతండు మీశక్తి నడఁతు ననుచు
మంత్రిశక్తి నడంచు నే మానవుండు! 41

వీఁడు కయ్యమ్మునకు మమ్ము బిలువకుండ
మేము మాయంత దండెత్తి రాము కాదె!
కొంగునను నిప్పు ముడివైచికొనిన మీఁదఁ
గాల్పకుండక పోవు నెక్కరణిఁ జెపుడ. 42

అరయ నీతఁడు కలవాఁడె యాను గాక!
కంటె యాగాక మఱియు నింగ్లండ్రిటందు
తెలుఁగు భాషాప్రసక్తి యే తేరినప్పు
డీయమాత్యుని ముం దెవఁ డెంతవాఁడు! 43

ఎవఁడురా! మద్గురూత్తము నీసడించి
కలము నడిపెడివాఁడని పలికె నితఁడు
తెలియవచ్చెను. పో నక్క పులిని జూచి
వాతలం బెట్టుకొనియెఁ జెప్పంగ నేమి? 44

అల్లమాత్యుల గూర్చి నే నాడితనిన
వేద వాక్యంబు లగుచు నొప్పెడిని గాక!
త్రిపుర నేని రామస్వామిఁ దెలియ రెవరు?
కాదుగద! వీఁడు తుదకు శిఖండి యైన? 45

ఆనఁబెంచుట యందును నరసికొనుఁడు
నాదు గ్రక్కినయట్టి యన్నమునె మెక్కె
నింక నీతని కీ గర్వ మేల? చెప్పుఁడ
మక్కువైనను గలదె? యీ గుణము తుదకు? 46

ఇంక నీ కవితాశక్తి యేమొ జూపి
నన్ను నిర్జింపుమంచనినాఁడు హీహీహీ!
యుత్తరింతునా కుత్తుకఁ గత్తిఁబట్టి
యింతటను జావఁడే మానవంతుఁ డైన? 47

ఇంక నీతఁడు నాకేమొ హితవులు జెప్పె
నోరు జారక మర్యాద నోరుమనుచుఁ
జెప్పు దెబ్బలు మర్యాద చెప్పుతేదె?
నోరుజారుట కింతయు నోర్వ కలదె? 48

చెట్టు పుట్టలతో విరాజిల్లు నేల
కోతి మూఁకలు కొంపాడు కొను నఁటంట
సర్వసస్యసమృద్ధ మీ పూర్వభాగ
మిందు లేదంట! కోతుల కింత తావు. 49

నీచుఁడైన నను వీఁడీడ నిజముబలికె
సంతసముగూర్చు నాకిది కొంతయైన
నాంధ్రభాషను మంత్రులున్నంత వఱకు
నింకఁ దనబోటి మిడుతల కేది తావు? 50

ఎవరు భావార్ణవ గ్రంథ మీసడింత్రొ
వారలారసి రంట గుంటూరు సీమ
మఱచె నెట్లింక వీఁడభిమన్యు మాట?
వసరె నెట్లింక దుర్యోధనుని గుఱించి? 51

మఱియు వీడింక నాబుద్ధి మాంద్యమెత్తె
బుద్ధిమాంద్యంబునకుఁ దానె బోలుఁగాదె?
వీఁడు "సీమల" జూచిన వాఁడయేని
నాదు భావార్ణవం బెట్లనాదరించె 52

అరయ నాకన్నఁ బెద్దపెద్దలైనవారె
తోక జాడించి గోడను దూకిరంట
ఆంధ్రభాషను నాకన్న నధికుఁ డెవఁడొ
ఆంధ్రులగు వారినే జెప్పుమనెద నేను. 53

భళిర! నేను బరాకనవలయు నట్టి
సైచునంట తానింక దోసంగు నాద్ది
వీఁడు నా కాళ్లఁబడి నన్ను వేఁడికొనిన
నేను సైపంగవచ్చునే వీని దోసఁగు? 54

ఇంత దోసము తననెత్తి నెత్తికొనుచు
వీఁడు నా దోసఁగును సైచువాఁడె? చెప్పుడ!
మగువ మొఱవెట్టెనే భళీ! మగనిఁగొట్టె?
ఇంతకన్నను దారుణ మెందుగలదు? 55

మా యమాత్యులు మఱి యోడిపోయిరంట
కంటె యొకనాఁడు 'తిరుపతి కవుల' కిలను
మా యమాత్యులరే యోడిపోయి రేని
మీసములు తిరుపతికవుల్ దీసిరెట్లు? 56

ఇంక నాఁ డమాత్యుల మీసలెవ్వి?' యనియె
నవ్వి కలనందు వారి కావ్యములయందు
మూతిపై వాని జూపింపఁ బోలు నేని
రొమ్ము చూపింపుఁ డెళపిళ్ళ వియ్యమంది. 57

ఒదిగినారంట మాయమాత్యులకు మీఁద
సత్యవీశ్వరు శివరామశాస్త్రి దాకఁ
జచ్చిపోలేదు శివరామశాస్త్రి యపుడె
యతఁడె యుండ్దున నాకు మాట్లాడుఁగాక? 58

ఇంక నాఁడమాత్యుల మీఁద తెవ్వి యనియె
నవ్వి కలవందు వారి కావ్యముల యందు
మూఁతిపై వానిఁ జూపింపఁ బోలు నేని
రొయ్య జూపించుఁ జెళపిళ్ళ వియ్య మంది 59

కంటె కవిరాజు కలఁడు పోకడ నటంట
క్రిందుమీఁదై రటంట మంత్రిందులంట
ఆ మహాకావ్యమేమొ తెమ్మనెద నేను?
క్రిందు మీఁదై రదెట్లు మంత్రిందు లింక! 60

ఇంక నాఁడమాత్యుల మీఁద తెవ్వి యనియె
నవ్వి కలవందు వారి కావ్యముల యందు
మూఁతిపై వాని జూపింపఁ బోలు నేని
రొయ్య జూపించుఁ జెళపిళ్ళ వియ్య మంది 61

అరసిన జెళ్ళపిళ్ళను వేలూరి వాని
గొప్పగాఁ జెప్ప నొప్పెదఁ గొంతవఱకుఁ
దెలుప నేఁటికి వారితోఁ ద్రిపుర నేని
నేనుఁగలతోడి సామ్యమూః గానుగలను. 62

చూడమా మంత్రులంట యీనాఁడఁటంట
నామరూపాలు లేక యున్నార లంట
మంత్రులకె నామరూపముల్ మంట గలియ
వంతరింపక యెట్లున్న దాంధ్రజాతి!

ఇంక నేఁడమాత్యుల మీఁస లెవ్వి యనియెఁ
గలవటందును వారి యాదలల యందు
ఏవి జూపింపుఁడఁచను నే యితండు?
రాకపోవుత నాంధ్రి కీ ప్రశయ మెప్పుడు! 64

నామరూపంబు లీనాఁడు నాకుఁబోని
యొక్కనాడైన నయ్యావి యుండుఁ గాదె?
వన్నుఁ బలె సాంధ్రి జాతి కేనాడు కలవు
నాకు నది ముండెయే కద నాఁడు నేఁడు? 65

వీని కులమేను దెలియఁగ లేని కతన
నడుగ కున్నాడ నేమియు నందు గుఱిఁచి
అయిన నేమాయె నడిగెద నాంధ్రి జాతి
నేఁటి కే రంగమున మాకు సాటి యెవఁడు? 66

ఉండెదరుగాక! యెవ్వరో యొక్కటిద్ద
ఆరయ సంఖ్యాధికమ్మె మాయదియ కాదె?
వలయు నెడఁ జెప్పెదను నేను బందె మొడ్డి
యురక బేలిన నేమి ప్రయోజనమ్ము? 67

తన కులమ్మువారు తన యింటిప్రక్కను
నలువురున్న నిట్లు బలుకనౌనె?
నేటి కెందు నైన నియ్యోగులే కాదె?
చెప్పఁదగినవారు, గొప్పవారు. 68

అణఁగియుండురె గాక! వార్ధికముఁగ
నల్పులయ్యెద రేమొకో యంతమాత్రె
కలిమి లేములు సర్వత్ర కలవు కాదె
కంటె కావడికుండలు కావె యవ్వి? 69

ధనమదాంధత్వ మయ్యాది కనులఁగప్ప
వీనిబోంట్ల కమాత్యులు గానరారె?
తన్నుచున్నాఁడ వీరల ధనము నేను
దానమున నన్ను మించిన ధనికుఁడెవఁడు? 70

ఈడ మారాజు చెప్పుచున్నాడు వినరె
యితని మించిన ధనవంతుఁ డెవ్వఁడనుచు
నింక నీయిల ధనవంతుఁ డెవ్వఁడౌనొ
వచ్చి చూపించెడినిగాక! వాని మొగము. 71

ఆది కవి సింహముల గుండె లదర గొట్టి
స్వర్గమున కయ్యెనఁట వీఁడు చక్రవర్తి
ఆది కవి సింహముల మాట కర్థ మేమి?
ఆశుకవులేమొ కాఁబోలు నచ్చు తప్పు. 72

తెలియఁ గోరెద నేడ యా త్రిపుర నేని
ఆశువున గొప్పరవు వారి నధిగమించెఁ?
త్రిపుర నేనియె కాదందు దేవుఁడైన
నక్కవీంద్రుల కొక లెక్క యానె? చెప్పుడు! 73

స్వర్గమున కయ్యెనఁట యింకఁ జక్రవర్తి
ఆడ శ్రీనాథుఁడుంట వీఁడరయఁ డేమొ
వాని కొక్కింత యిది వినఁ బడియె నేని
త్రిపురసేని త్రిశంకుని రీతిఁ గాఁడె? 74

ఆ త్రిశంకుని గాధేయుఁ డాదికొనుచు
నేలఁబడకుండ నడిమిన నిలిపెఁ గాక
ఈ త్రిపురసేని నెవ్వఁ డడ్డేలువాఁడు?
మంత్రి కన్నెఱ్ఱ నెవ్వాఁడు మాడి పోఁడు? 75

అనియె నావలఁ గవిరాజు నతకరించుఁ
శక్తి గలవాఁఢ వేమని జంపు లేక
కాదు కవిరాజు వాఁడొక గత్తిక పోఁచ
వాని యబ్బ నడంతు నీ భామయందు! 76

ఇంతటను బోక మఱియుఁ గన్నెఱ్ఱఁ జేసి
నేను దన్నుచు మన్నాఁడ వాని చితిని
ఎవఁడురా! నన్ను నిందువ నెదిరికొనుచు
వాని కవిరాజు బిరుదు గాఁపాడు వాఁడు? 77

సాపుజేసిన నాఁటి మీసాల కొఱకు
దీసినాఁడంట నేను వాగ్దేవి శీల
మెవరు పెంచిరి మీసంబు లెవరు దీసి
రిది వితండము గాఁక మఱేమి? చెప్పఁడ! 78

మీసములఁ బెంచి చెలపిళ్ళ దీసె గాదె
రెండు భాషలకేమె యుద్దండుల మని
అప్పుడు వాగ్దేవి శీలంబు నతఁడు గాక
ఏను భంగంబొనర్చితి నెట్లు? చెప్పుడ? 79

పరువు తిరుపతి వేంకటేశ్వరు లదంట
తెలుపదే మీసములఁ బెంచి దీయుసేత?
చెప్పు దెబ్బల నాకింకఁ జెప్పు నేని
చుక్క కరువదే! దానికి లెక్క యున్నె? 80

కొనసు వచించె మా సుకవి
కుంజరు శక్తి కళా సరస్వతీ
వ్యసనులు మిమ్ము బోంట్లు తెలి
యంగలరాయని నిక్క మెవ్వరో
యసదులు వాని శక్తిఁగొని
యాడుదురైనఁ గళా సరస్వతీ
వ్యసనులు మమ్ము బోంట్లు కది
యర్థము లేనిది చెప్ప నేటికిఁ? 81

దమ్ము కలదేని యింక రాదగు నటంట
సిద్ధముగ నున్న వాఁడంట యుద్ధమునకు
నవ్వుదునొ ఏని మాటకు నొవ్వుపోదొ
చావఁదలఁచెనె యకట నిష్కారణముగ? 82

నాదు కన్నెఱ్ఱ బ్రహ్మ రుద్రాదు లొకట
మాడిపోదురు నిలువంగ నీడ లేక
మానవుఁడ యిస్సిరో! నన్ను మారుకొనుమీ
బెండులు మునింగి తేలెనే గుండు లిలను! 83

కయ్యమైనను మాటఁ జెప్ప వియ్యమైనఁ
దనకుఁ దగు వానితోఁ జేయ జను నటండ్రు
వీఁడు నాదమ్ము నడుగు చున్నాఁడె కాని
ఏను వీనికిఁ జూపింతు నెట్లు దాని! 84

అంతటను బోక వినరే! వీఁడన్న మాట
ముండ వలె నుండ వలె నంట ముసుఁగు దాల్చి
యుండవలెనని మ్రొక్కిన ముండ నగుదె?
ముఁడలనుఁ జేసి తనభోంట్ల బొత్తుగాక? 85

వ్రాసె నీ భాస్కరుం డెన్ని పద్యములను?
కంటె యందున నెన్ని వాక్యములు నిలచె?
దండి మగఁడెవ్వఁడో యింతి ముండ యెవఁడో
యింతచాలదె? విబుధుల కేర్పరింప. 86

కంటె యొక గవ్వకేనియుఁగాని హీనుఁ
డడుగునే దమ్ము? నను ముండయనఁగ జనునె?
యెంతవఱకని శాంతి వహించువాఁడ!
ననుభవించుత తత్ఫల మాంధ్రజాతి. 87

వెనుక నొకపూటకే యేకవీర వ్రాయ
విశ్వనాథను బోరికి బిలిచి నానా
నేఁడు వినఁదగు నాంధ్రులు మూఁడుకోట్లు
దాని వ్రాయంగఁ జెప్పుచున్నాను నేను. 88

ఏను నాదమ్ముఁ జూపింప నెంచినప్పు
డొక్క యధముని మీఁదనా యొరుగఁబడుట?
కంటె నాయది మంత్రి ర[illegible]ంబు కాదె?
నన్ను గనుతల్లి కింత మానంబు లేదె? 89

"ప్రల్లదుఁడైన యొక్క కుల
పాంసను జేసిన దానఁ దక్కులం
బెల్లను దూషితం బగుట
యేమి యపూర్వము"? తక్షకుండు నో
చెల్ల! పరీక్షితున్ హతము
జేయఁగ నాతని పుత్రకుండు దా
నల్లన దీర్చెఁగాదె తన
యాగ్రహ మేగఁగ సర్పయాగమున్. 90

అట్ల నేనును నొక భాస్కరాధ మెంచి
యనదగాఁ జేతు నీ సకలాంధ్రజాతి
నట్లు కాదే గడంగుదు నాత్మహత్య
కింతకును మించి నాబోంట్ల కేమి వలయు? 91

ఇందు నన్ను జయంబె వరించు నేని
అబ్బురం పడవల దెవ్వరందు గుఱించి
కాలవశమున నోటమి గలుగు నేని
వగవఁబనిలేదు దాని కెవ్వారు గూడ. 92

ఏలి తీ యాంధ్రభాష వెయ్యేండ్ల నుండి
యెందు నేనియు నొకఁడు నా కెదురు లేక
చాలు నింకెంత కాలమే నేల వలెను?
బోలు నన్నింక నెవఁడెన్ని పుట్టువులను? 93

చెప్పు దెబ్బలు గొప్పగాఁ జెప్పరాదు
కఱ్ఱ దెబ్బల నొక్కింత గణనసేయఁ
గత్తి దెబ్బల నామేను గాయపరచు
ఢేను దీర్ఘఁ గాలంబున వానినెల్ల. 94

కుక్కవోలె మొఱుంగుట లెక్క కాదు
భంగపుచ్చంగ వలె హేతువాద మందు
రండు నామీఁద నింక నా దండి మగలు
వ్రాసెదను నేను వేయి తరంగములను. 95